# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.

సంపాదకుడు :
అంద్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౫.  ధాతు, పుష్యము : జనవరి, 1937.  సంచిక : ౬.


## సంపాదకీయ సమాలోచన

**౧. కీ. శే. బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారు.**

ఆంధ్రనాయకులలో ప్రజాసమూహమును ఒక్కత్రాటిమీదనడుపగలశక్తి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారికి, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారికి మాత్రమే ఉన్నదని ఆంధ్రేతరులుకూడ నొక్కి వక్కాణించియున్నారు. నిర్మాణశక్తిగల ఆయిద్దరి నాయకులను క్షయరోగమే పొట్టను పెట్టుకున్నది. శ్రీసుబ్రహ్మణ్యముగారు మొన్నటి ముక్కోటి ఏకాదశినాడు పరమపదించినారు. లజపతిరాయివలె వీరును లాటీదెబ్బకు గురిఅగుటచేతనే అకాలమరణమునకు పాల్పడిరని చెప్పవలసియున్నది. ఆయనవృత్తి, వాక్కు కూడ జనవశీకరణమునకు సమర్థములయినవి. వైద్యుడుగా ఆయన అమృతహస్తముకలవాడు; ఉపన్యాసకుడుగా ఆయన అమృతవాక్కు కలవాడు. త్యాగముచేసినాడుకాని శాసనసభాసభ్యత్వముపై మోజుపడలేదు. ఆశ్రమము నిర్మించినాడుకాని జయిలు నివాసము మానలేదు. మహాత్ముగల దేవుళ్ళను బట్టి మారుమూలస్థలములు యాత్రాస్థలములగునట్లే త్యాగమహిమగల సుబ్రహ్మణ్యముగారి మూలమున మారుమూలనున్న సీతానగరము కాంగ్రెస్ వారి యాత్రాస్థలముగా మారినది. గాంధివంటి మహాత్మునికూడ ఆకర్షింపగల తేజము దానికి కలిగినది. ప్రభుత్వమువారి కన్నెఱ్ఱకుకూడ అది గురియైయుండినది. తిరిగి దానిని పూర్వస్థితికి తెచ్చినపుడే సుబ్రహ్మణ్యముగారి పవిత్రాత్మకు శాంతి నెలకొనునను విషయము ఆంధ్రులు మరవకుందురుగాక !

**౨. సౌత్ ఇండియా కో ఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీయభివృద్ధి :—**

గతవత్సరమున సౌత్ ఇండియా కోఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీవారి వ్యాపారాభివృద్ధి ప్రశంసనీయముగ నున్నదని చెప్పుటకు చాల ఆనందించుచున్నాము. 1932-వ సంవత్సరమున స్థాపింపబడిన క్రొత్త భీమాకంపెనీయే అయినను, భీమావ్యాపారప్రపంచమున చెప్పదగినంత పోటీయున్నను ఈ క్రింది అంకెలు తెలుపురీతిని అభివృద్ధి కనబఱచిన సౌత్ ఇండియా కో ఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీ కార్యనిర్వాహకులను అభినందింపవలసియున్నది.




| | |
|---|---|
| 30-6-1936 తేదికిగల సభ్యుల సంఖ్య | 3,394 |
| 1935-36 లో వచ్చిన ప్రొపోజల్సు | 1,753 |
| వాని విలువ | 14,16,750 |
| 1935-36 లో జారీచేయబడిన పట్టాలు | 1,357 |
| వాని విలువ | 10,99,150 |
| 30-6-36 న అమలులోవున్న మొత్తపు పట్టాల సంఖ్య | 3,110 |
| వాని విలువ | 26,13,441 |

దీనిపై రిజిష్ట్రారువారిచ్చిన ఆడిట్ సర్టిఫికెట్ కూడ చాల ప్రోత్సాహజనకముగ నున్నది. మొదటి యాక్చ్యూరియల్ వాల్యుయేషనులో రూ 29,286-12-6 సర్‌ప్లస్ మిగిలినది. జీవితభీమాలపై వేయికి 15 రూపాయిలును, ఎండోమెంటుభీమాలపై వేయికి 10 రూపాయిలును, బోనస్సు ఈయగలుగుటకు వీలుకలదని రిజిష్ట్రారువారు సర్టిఫికెట్టు ఇచ్చినారు. ఈ సుస్థితికి కంపెనీ నిర్వాహకులను మెచ్చుకొనికూడవలసియున్నది.

౮. నిజామురాష్ట్ర ఆంధ్రమహాసభలు : గుణపాఠము :—

నిజామురాష్ట్రపు ఐదవ ఆంధ్రమహాసభలు షాద్‌నగరమున జయప్రదముగ జరిగినవి. ఆసభావృత్తాంతములను పరిశీలించినచో నిజామురాష్ట్రమునగల ఆంధ్రుల కార్యోత్సాహము, త్యాగదీక్ష, అన్యోన్యత సువ్యక్తమగును. నాగరికతలో ఎంతయో అభివృద్ధి కాంచియున్నాము, కాంచుచున్నాము అని సగర్వముగ చెప్పుకొను బ్రిటిష్ భాగమునందలి ఆంధ్రులు ఆసభలను చూచి నేర్చుకొనవలసిన గుణపాఠము లెన్నియోగలవు. బ్రిటిష్ ప్రాంతమున రాజకీయసభ అసలుఆంధ్రమహాసభను నామమాత్రముగ చేసినది. ఆసభవిషయమై పూర్వముండిన ఉత్సాహము ఇప్పుడు లేదు. దానిపని తద్దినముపెట్టువాని తమ్మునివలె అయినది. ఇకనైనను దానిప్రత్యేకత తిరిగి దానికి కొనివచ్చి దానిని తిరిగి ఆంధ్రమహాసంస్థగ చేయవలసియున్నది. ఏదేశముననున్నను ఆంధ్రులెల్లరు దానిని మాతృసంస్థగ చూచుకొని గర్వించగలస్థితి దానికి కల్గించవలసియున్నది.

౯. కుప్పుస్వామిచౌదరిగారి వదాన్యత :—

గుంటూరుమండలమున ఇటీవల సంఘటిల్లిన తుపాను నష్టనివారణకుగాను గుంటూరు మండల పౌరులలో ప్రముఖులగు శ్రీయుత జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు చేసిన ఆర్థికసాహాయ్యమునుగూర్చి మదరాసు ప్రభుత్వసభ్యులగు సర్ చార్లెస్ సౌటర్‌గారు చెప్పిన ఈ వాక్యములు చౌదరిగారి సాటిలేనివదాన్యతకు యోగ్యతాపత్రములై యున్నవి ; 'జె. కుప్పుస్వామిచౌదరిగారు తుపానువల్ల స్వయముగా ఎంతోనష్టపడినప్పటికిని ఆహారపదార్థములు కోలుపోయినవారందరికిని కావలసినంతధాన్యము పంచిపెట్టినారు. వ్యక్తుల ఇట్టి వదాన్యత ప్రశంసనీయము. అది ప్రజాహితజీవనమునకు చిహ్నము.'

ఎదురుచూడుడు!



స్టార్ కంబైన్సు వారి

రెండవ

తెలుగుటాకీ.

సుప్రసిద్ధ నటీనటులు

పాల్గొన్న

మనోహర దృశ్యము.

# సారంగధర

పి. పుల్లయ్య (బి.ఏ) గారిచే డైరెక్టు చేయబడినది.

బొంబాయి మహానగరమున,

కోల్హాపూర్ నగరమునగల

సుప్రసిద్ధ సినీమా లేబరేటరీలందును,

స్టూడియోలందును

తయారు చేయబడినది.

త్వరలో విడుదల చేయబడును.



**Star [illegible]mbines, Limited.** 161, Mount Road, Madras.

# చిట్టిగారెలకు లొట్టలు వేసే హరనాథబాబా

రచయిత :

లక్ష్మీనారాయణ పాణిగ్రాహి

హరనాథుడు సోనాముఖివాసియనియు, కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రుడనియు, కాశ్మీరమునకు ఉద్యోగమునకై పోయి కొంత కాలము సభ్యతాధర్మమవలంబించి సొమ్ము అపహరించుటచే తరిమివేయబడగా తిరిగి వచ్చునపుడు మనోవ్యాకులతచే పిచ్చెత్తి మార్గమధ్యమందు అడవిలో స్వర్గస్థుడయ్యెననియు అతని చిన్ననాటి స్నేహితులు చెప్పుచున్నారు. అతని అంతరంగికభక్తులమని చెప్పుకొను కొందరు గోరంతలు కొండంతలుగాజేసి అనేకలీలలు జరిగినవికొన్ని, జరుగనివి కొన్ని కల్పనచేసిరి.

ఈ హరనాథుని జీవితచరిత్ర జాగ్రత్తగా పరిశోధనచేసినచో అన్నియు లీలలే కన్పించునుగాని, దేశకల్యాణమునకుగాని మానవకల్యాణమునకుగాని తోడ్పడు ఉత్కృష్టకార్యములు ఏవియు గానరావు. ఇతని లీలలు చూడగా హిందూదేశపు గారడీవాని వింత పనులవలె కన్పట్టును. మరియు ప్రస్తుత యుగమందు జన్మించిన మహాపురుషుల జీవితముల ముందు యీపాగల్ హరనాథుని జీవితము హాస్యాస్పదముగా గోచరించును. ఇతనిని ఆదర్శపురుషునిగా లెక్కవేయుటకు అర్హతలు కలిగియుండలేదు.

ఇతను చైతన్యమతమునకు చెందినట్లు చెప్పుకొనుచున్నాడు. పవిత్రమగు చైతన్యునకు కళంకము ఆపాదించుచున్నాడు. చైతన్యమతావలంబకులగు శ్రీరామకృష్ణపరమహంస, వివేకానందస్వాములవారు చేసిన మానవసేవ, భక్తిప్రబోధము భగవంతుడనని చెప్పుకొనుచున్న ఇతడెంతవరకు చేయగల్గెను? వారిచే నెలకొల్పబడి ప్రజల ఆదరాభిమానములకులోనై యిప్పటికిని మిక్కిలి చక్కగా నడుపబడుచున్న శ్రీరామకృష్ణసేవాధర్మసంస్థలు చేయు కార్యములముందు ఈ హరనాథ అట్టహాసములు ఏపాటివి? హరనాథుడు భగవంతుడుకాడు. నమ్మవలెను. ఏ మహనీయునియందు మానవసేవాతత్పరత, త్యాగబుద్ధి, కార్యదీక్ష భక్తియందనురక్తి మూర్తీభవించియుండునో అతడే భగవంతుని ప్రతినిధిగా పూజింపనర్హుడు. తదితర దొంగ సన్యాసులకు, కపటనాటకసూత్రధారులకు స్థానములేదు.

మన హరనాథునకు ధనకాంక్ష మెండు. మూల్యము ఎంత ఎక్కువగా సమర్పించిన తన కరుణాకటాక్షవీక్షణములు భక్తులపై అంతవిరివిగా ప్రసరించును. హరనాథుని భార్యయగు కుసుమకుమారికి నవరత్నముల బంగారపు కిరీటమేల? అమూల్యమగు అభరణములెందుకు? ఈమె తన మతప్రచారమునకు కొంతమందిని జీతములనిచ్చి పోషించుచున్నదని తెలియవచ్చుచున్నది. కుసుమకుమారికి దైవసంబంధమగు జిజ్ఞాసనున్న. చిలకపలుకులవలె సందేశములనిచ్చుచుండు

ను. ఆమె జన్మోత్సవమునకు విరివిగా ధనవ్యయంచేయుట పరిపాటైపోయినది.

ఇటువంటి బాబాలు ఎన్ని ఉద్యమములు మతం, దేవుడుయని లేవదీయలేదు! తాత్కాలికముగా కొందరు స్త్రీ పురుషులు ఉద్రేకపూరితులై సర్వసంగ పరిత్యాగముచేసి బాబాలవెంట వెంబడించిరి. ఆచరణయోగ్యములగు పద్ధతులనే మేబాబా చెప్పిన అవలంబింపవలెను. హరనాథభజనచేయునపుడు భగవంతుడు భక్తులపై ఆవేశమై సందేశమిచ్చుచున్నాడట. ఇది ఎంత తెలివితక్కువ నమ్మకమో పాఠకులే ఊహింతురుగాక. ఆవేశమై భగవంతుడు స్త్రీపురుషులపై బడి చిందులాడునట. హరనాథుని పూజించిన కోరికలన్నియు నెరవేరునట.

వేడిరక్తం ప్రవహించుచున్న యువతీ యువకులయందు ఈహరనాథబాబాతత్వం ఎక్కువగా వ్యాపించియున్నది. హరనాథుడు కొంతకాలం పిచ్చివాడయిపోయెను. ఆపిచ్చి సమయమందు నోటికివచ్చినట్లు అరచువాడు. తాను ప్రప్రథమమున చైతన్యభక్తుడు. భక్తుడగుటచే భగవత్సంబంధమగు పిచ్చిమాటలు కొన్ని పలికియుండవచ్చు. 'నేనే చైతన్యుడను, నేనే హరగోపాలుడను.' ఇటువంటివాక్యములు వాటిలోకొన్ని ఈమాటలనుబట్టి వారిశిష్యులు మరికొన్నివాక్యములు కల్పించి వివిధమగు రంగులుపూసి గ్రంథస్థముచేసిరి.

ఈతనిలీలలు చిట్టిగారెలుతినుట—వెన్నపై పాదములుపడుట—భక్తులకు జాబులు వ్రాయుట—స్తనక్షీరములు గ్రోలుట—ఇంతకుమించిన ఏలీలలును జరిగియుండలేదు. జరిగియున్నను వింతగా భావించుటకు వీలులేదు. ఇంతకెక్కువగు చిత్ర విచిత్రమగు పనులు మనము చూచియున్నాము; వినియున్నాము. వింతలు లీలలు ఎల్లప్పుడు ప్రకృతిలో సహజముగా నిమిడియుండును. వీటికై భ్రమపడ నవసరములేదు.

ఇట్టి హరనాథపిచ్చినుండి ఆంధ్రులు దూరులుగా నుందురుగాక!

---

# భూలాభాయి జీవంజీ దేశాయి

రచయిత:

బి. కేశవరావు, బి.ఏ.



భూలాభాయి జీవంజీదేశాయి 1877 సం వత్సరం అక్టోబరు 13 వ తేదీని సూరతుజిల్లాలోని బల్సారుగ్రామంలో గౌరవకుటుంబమున జన్మించెను. ఈగ్రామం ప్రపంచప్రఖ్యాతివడసిన బార్డోలీసమీపంలో ఉన్నది. ఈతనితండ్రి గవర్నమెంటు ప్లీడరు. స్వగ్రామంలో చదువు చాలించినపిదప ఈతడు బొంబాయి ఎలిఫిన్‌స్టన్ కళాశాలలో మొదటితరగతిలో పట్టభద్రుడయ్యెను. గవర్నమెంటువారు ఐ. సి. యస్ పరీక్ష చదువుటకు స్కాలరుషిప్పు ఇవ్వగా కారణాంతరములచే వెళ్ళలేకపోయెను. తరువాత యమ్. ఏ. డిగ్రీ పొందెను. రెండుసంవత్సరములు అహమదాబాదులోని గుజరాతు కళా

శాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసెను. ఈ లోపున న్యాయవాదపరీక్ష చదివి జయము గాంచెను.

ఈతనిది మంచివర్చస్సుగల ముఖము. రూపసి. కంఠధ్వని అతిమధురమైనది. మాట్లాడునపుడు ఆకర్షణీయముగనుండును. ఇంతకును నిరాడంబరజీవి.

ఈతడు బొంబాయిలో న్యాయవాదిగా పని ప్రారంభించునరికి బొంబాయి హైకోర్టు అంతియు బారిష్టర్లమయంగావుండేది. కాని యీతడు యీదేశంలోనే విద్యనభ్యసించి న్యాయవాదవృత్తిలో పేరుప్రఖ్యాతి గడించెను. 1923 లో ఈతనికి బొంబాయి గవర్నరుగారి సభలో మెంబరుపదవి యిస్తామన్నారు. కాని నిరాకరించినాడు. అనేకసార్లు హైకోర్టున్యాయమూర్తిపదవి యిస్తామంటే అదికూడ నిరాకరించెను. 1926 లో దేశాయికి మానసికపరివర్తనంకలిగి బొంబాయి అడ్వకేటు జనరలుపదవి అంగీకరించెను. ఇదియు ఖాయంగాకాదు.

1932 లో కాంగ్రెసుతో జోక్యంచేసుకొంటున్నాడనే మిషచే రూ 10,000 లు జరిమానా, 1 సంవత్సరం ఖైదు గవర్నమెంటువారు విధించారు.

ఈతడు బహుచురుకైన న్యాయవాది. 15 సంవత్సరములక్రితం రిప్రెసివ్ లాస్ కమిటీ ఎదుట ఈతడు సాక్ష్యమిచ్చెను. ఇదివరలో లామెంబరుగాఉండిన సర్ తేజబహుదూర్ సప్రూ ఆ కమిటీ ఎదుట సాక్ష్యమిచ్చిన యుద్ధరిలో ఈతనిసాక్ష్యమే కడుంగడు ప్రశంసనీయముగా నున్నదని నుడివెను. 1928, 1931 లలో రెండు ప్రత్యేకకమిటీలు బార్డోలీ రైతులదుస్థితి విచారణచేసినవి. రైతులపక్షమున దేశాయిపనిచేసెను. అతినిపుణతతో రైతుల కష్టములు సమర్థించెను. ఈతని జీవితములో ఒకసారియే న్యాయాధికారితో స్పర్థ ప్రాప్తమయినది. అదియు రైతులపక్షమున బ్రూమ్‌ఫీల్డు కమిటీ ఎదుట వాదన చేయునపుడు సంభవించెను. తన వాక్పటిమచే దొరవారిని మెప్పించలేకపోయెను. కాన అందుండి తాను విరమించెను.

ఈతడు మొదట సహాయనిరాకరణమున పాల్గొనలేదు. దరిమిలాను గాంధితత్వము చక్కగ పరిశీలించియు, బార్డోలీ తన ఊరికి సమీపంలో వుండుటచేతను గాంధి ఉద్యమ మీతనిని ఆకర్షించినది.

మోతీలాలు జీవించియున్నప్పుడు రాజకీయ రంగమున ఈతడు కన్పించలేదు. మోతీలాలు అస్తమించినపిదప ఆలోపము ఇతడు తీర్చెను. అసంబ్లీహాలులో ఈతని ఉపన్యాసము ప్రేక్షకులు నిరీక్షిస్తూవుండెదరు.

నేటి హిందూదేశపు రాజకీయ నాయకులలో దేశాయి అగ్రగణ్యుడు. కాంగ్రెసును తిరిగి పార్లమెంటరీ విధానమునకు త్రిప్పినవారిలో ముఖ్యుడు. కాంగ్రెసుపార్టీ నాయకుడై, ఎసంబ్లీలో కాంగ్రెసుకు జయపరంపరలను జేకూర్చిన వీరుడు. కొన్నిమాసముల క్రితం ప్రభుత్వవిధానమునకు అసమ్మతి తెలుపుచు ప్రజలమన్ననకు పాత్రుడై తనపార్టీ సభ్యులతో ఎసంబ్లీ సభాభవనమునుండి లేచి వెళ్ళెను. ఆ మరునాడు ఈతడు యిచ్చిన ఉపన్యాసము అమోఘము. 1936 డిసంబరు మొదటివారములో సరిహద్దు రాష్ట్రమున కేగి కాంగ్రెసు సందేశమును అందజేసెను.

వేసవిలో ఖండాంతరములకేగి కాంగ్రెసు ప్రచారము గావించెను. ముందు కాంగ్రెసు అధ్యక్షుడగుటకు అవకాశము, అర్హత ఉన్న భారతీయులలో ఈతడును ఒకడు.

# మానినీ చిత్తచోరుడు

రచయిత :

కవికొండల వెంకటరావు, బి.ఏ.,బి.యల్.

["జవ్వని ముఖంకేసి చూచినాడు. పరికొత్తజవ్వనం ఊరకవిస్తూవుంది. మెళ్లో వల్ల వూసన్నాలేదు. చేతుల్ని అంతకంటె ఏమీలేవు. కాళ్ళకు అసలే ఏమీలేవు. వొళ్ళే పిల్ల! పిల్లే వొళ్లు!"]

ఈగాథ ద్వాపరయుగంనాటిది. శ్రీకృష్ణ భగవానుణ్ణి గురించి వ్రాసింది. ఇందులో కొంతమట్టుకు ప్రేమ ద్యోతకం అవుతూవుంటుంది. కొంతమట్టుకు విరక్తి ద్యోతకం అవుతూవుంటుంది.

—ఋషులంతా స్త్రీలై భూలోకంలో సత్యభామాదులక్రిందనూ, గోపికలక్రిందనూ జన్మించి, శ్రీకృష్ణభగవానులవారితో అష్టైశ్వర్యాలూ, ఇష్టభోగాలూ అనుభవిస్తూ పిల్లాజెల్లాతో వ్రేపల్లెవాడలో వర్ధిల్లుతూవున్న సమయంలో శ్రీనారదమహర్షులు, వైకుంఠంలో వొంటిగా ఋషినామంతో వుండలేక పోతేనేం, శ్రీకృష్ణులవారి రసికత్వం గ్రహించాలనే కుతూహలంచేతనైతేనేం, తానూ వొకస్త్రీగా భూలోకంలో జన్మించి, సాక్షాన్నారాయణమూర్తియైన యదుయాదవకుంజరునితో సంసారం సాగించాలని గట్టి కోరిక తనలో వృదయింపజేసికొన్నాడు.

మహర్షులకు కోరికపుట్టిందీ అంటే తీరింది అన్నమాటే!—

ఏలాగో వోలాగు భూలోకంలో స్త్రీగాపుట్టారు నారదులవారు. కాని భూలోకంలో జన్మించడంఅంటే జన్మతోనే పదవి అనేది ఒకటుంటుంది చూడండి! ఏ పదవి ఈ స్త్రీగా జన్మించిన నారదులవారు ఆక్రమించడం! అప్పటికప్పుడే రాధ, రాధ తరువాత రుక్మిణి, ఆమెతరువాత సత్యభామ ఇలాగ్గా అష్టమహిషులు, అరవై వేలగోపికలు కృష్ణునిచెట్టబట్టి, ఉట్లుకొట్టె పట్టుకొచ్చే వెన్నముద్దల దగ్గర్నుంచీ పాల్గొంటూ వున్నారు. ఈకొత్తగా జన్మించిన నారదస్త్రీకి తావెక్కడ? ఏలా తనను తెలుసుకుంటాడు శ్రీకృష్ణభగవానులు? ఏలా తనను అనుగ్రహిస్తాడు శ్రీపరమాత్మప్రభువులు?

అంచేత ఎక్కడా తావులేక 'నారదస్త్రీ' అనగా స్త్రీవేషమునవున్న నారదులవారన్నమాట—ఆమె యాదవపురంలో గట్టుకింద ఓ గంగరావిచెట్టుంటే ఆచెట్టుకింద మకాం పెట్టుకుని, అక్కడక్కడ పట్నమమ్మట తెల్లాఅడంతోనే జోలేసుకుని బిచ్చానిగ్గాను బయల్దేఱుతూ వుండేది. చేతిలో చితారుమోగించేది. చితారుపాటకుతోడు గాత్రంకూడా కలిపేది. గాత్రానికితోడు కాస్తోకూస్తో అభినయించేది. రాత్రిపవేళలికి ఆచెట్టుకిందకు చేరుకుని వొక్కర్తే కాలక్షేపంగా కాలంగడుపుతూవుండేది.

క్రమక్రమంగా వయసొచ్చింది. ఆడదానికి ఏం కావాలి వయసుంటే? అదే అందం! అదే అదృష్టం! పట్నంలో ఏక్కేగుమ్మం దిగే గుమ్మంగా ముష్టెత్తుకుంటూ శ్రీకృష్ణభగవానులవారికి ఆవయసప్పుడు ఓరోజున ఎదురైంది. ఎదురౌతూ పాడిందికదా! ఎవరో అనుకుంది!

> "చెట్టు వేలు నూపురం,
> చెట్టుకొమ్మ గోపురం,
> గట్టుకింద కాపురం,
> గట్టుమీద నే పురం :—"

అని పాడింది.

శ్రీకృష్ణభగవానులకు ఆపాట అదేదో కొత్తపాటలాగు వినబడింది. జవ్వని ముఖం కేసి చూచినాడు. సరికొత్తజవ్వనం ఊకవిస్తూవుంది! మెళ్లో నల్లపూసన్నా లేదు. చేతుల్ని అంతకంటే ఏమీ లేవు. కాళ్ళను అసలే ఏమీ లేవు. వొళ్లే పిల్ల! పిల్లే వొళ్లు!

అదో విశేషం. చేతిలో చితారువుంది. కంఠం వినసొంపుగా వుంది. చూచారు శ్రీకృష్ణపరమాత్మలవారు. చూచి కిమన్నాస్తి ఏమీ పలుకరించకుండానే తమదారిని వెళ్ళిపోయినారు.

ఆఘడియే ప్రారంభం జవ్వనికి వియోగాం కురం మొలకెత్తడం. మాపటికి చెట్టుకిందకు చేరుకుంది. చెట్టుకింద శుభ్రంగా తుడిచేసింది. చలికి తనకాళ్లు తనజోలిబొంతలో కుక్కుకుని, పండుకుంది చెట్టుమొదలు తలాడగా చేసుకొని; కాస్తదూరంలో పైబడ్డ వేలుంటే ఆవేలు తన్నుతూ అదేతాళవులయగా, చెట్టు కొమ్మల కేసిచూస్తూ చితారు మోగించి పాడుతూంది:

> "చెట్టు వేలు నూపురం
> చెట్టుకొమ్మ గోపురం
> గట్టుకింద కాపురం
> గట్టుమీద నే పురం."

అని—

సరిగ్గా ఆవేళప్పుడు శ్రీకృష్ణభగవానులవారేంచేస్తూవున్నారూ అంటే రుక్మిణీదేవితో సొగటాలపాళీ ఆడుతూవున్నారు. ఆడుతూ ఆడుతూ ఆటఆపి ఆమెతో "ఇప్పుడేవస్తాను, వుండు" అన్నారు. రుక్మిణితో అలాచెప్పి వెళ్ళిపోతూవుండడం స్వామికి పరిపాటే. అది అప్పటికప్పుడే ఏలతొంపదివేలపదకొండో పర్యాయమో అయియుంటుంది. అంచేత ఆమె భర్తను ఎక్కడికనిగాని ఎందుకనిగాని అడగలేదు.

* * *

నారదస్త్రీ పాడుతూ పాడుతూ శ్రీకృష్ణభగవానులవారి అడుగుల సవ్వడి చీకట్లో విన్నదై పాట ఆపి 'ఎవరు మహానుభావులు?' అని పృచ్ఛించింది. 'నేను నారదమహర్షిని' అన్నారు స్వామివారు. "కారు! కారు! నారదమహర్షులు కారు. నారదమహర్షులే అవితే ఏది యీచితారు మోగించిపాడండి' అంది జవ్వని.

స్వామి అపూర్వంగా సరిగ్గా నారదులవారెలా వాయించేవారో అలా వాయించారు, ఆజవ్వనిచేతిలోనుంచి చితారందిపుచ్చుకుని.

జవ్వని ఆపాళంగా అంది "నాహృదయాన్ని కరిగించిన మగవాడింతవరకూ వొకడూ లేడు దేవా! మీరుతక్క! మీ పేరు?" అనిఅడిగింది. "ఈమధ్యాహ్నం కలుసుకోలేమనం" అని అంటూ స్వామి తిరోహితులైనారు.

"ఆయన శ్రీకృష్ణభగవానులా?" అని జవ్వని మర్నాటినుంచీ తన్నుదాను ప్రశ్నించుకుంటూ భిక్షాటనమఱచి ఆచెట్టుక్రిందే మహాతపస్సుచేసిచేసి తరించింది.

# ఉత్తరతలాపిగా ఎందుకు పడుకోకూడదు?

రచయిత :
ఆయుర్వేదభూషణ, భిషగ్వర
వేటూరి శంకరశాస్త్రి, ఎ. ఎం. ఎ. సి.

[ఉత్తరదిక్కుగా తలపెట్టి పడుకోరాదని శాసించుటయేగాని దానికి సరియగు కారణమును చెప్పకుండుటచే నీయాచారము ఇంతదనుక కేవలము మూఢాచారముగ పరిగణింపబడుచున్నది. ఈవ్యాసమున ఉత్తరదిక్కుగా తలపెట్టి పండుకొనరాకుండుటకుగల హేతువులు చక్కగ నిరూపింపబడినవి. ఈ ఆచారము మానవుని ఆరోగ్య విషయమున ఎంతటి ప్రముఖమైనదో ఈవ్యాసమును శ్రద్ధగ చదివినచో అవగతమగును. ఉత్తరదిక్కుగా శయనించుటకును ఉన్మాదమునకును ఏదోసంబంధముండుట పాశ్చాత్యవైద్యులుకూడ అంగీకరించియున్నారు. పరినిష్ఠమైన తమ వైద్యవిజ్ఞానమునకు పరిణతమైన తమ శాస్త్రవిజ్ఞానమును మేళవించి శ్రీశాస్త్రిగారీవ్యాసమును రచియించి మన ప్రాచీనాచారమునకుగల అంతరార్థమును వెల్లడించుటలోపాటు మన పెద్దలకు విద్యుచ్ఛక్తినిగూర్చి, ఆకర్షణశక్తినిగూర్చి గల సూక్ష్మపరిజ్ఞానమును బాగుగ వెల్లడించిరి.
సంపాదకుడు.]

ఉత్తరపుదిక్కుగా తలపెట్టి పడుకోరాదని పెద్దలు చెప్పుదురు. ఈఆచారమును హిందువులందరు పాటింతురు. ఇట్లెందుకు పడుకోరాదని మనము అడిగిన సరియగు సమాధానము చెప్పి తృప్తిపరచగలవారు అరుదుగా నుందురు. అందువలన ఇది కేవలము మూఢాచారముగాకూడ కొందరు తలంచుచున్నారు. పరిశీలించి చూచినచో ఈ ఆచారము కేవలము చాదస్తముగాదనియు, దీనికిని గూఢమగు అంతరార్థముకలదనియు తెలియగలదు. మనుష్యులు ఆరోగ్యవంతులై యుండుటకు ఈ నియమ మెంతయు సహాయకారికాగలదు. మరియు ఆధునికవిద్యావిశేషములుగా తలంపబడు విద్యుత్ శక్తి Electricity, ఆకర్షణశక్తి Magnetism, అను విషయములలో మన ప్రాచీనులకు ఎంతటి సూక్ష్మపరిజ్ఞానము కలదియు ఈ విషయమునుబట్టియే మనము నిర్ణయింపవచ్చును.

సదాచారములను నిరూపించు ధర్మశాస్త్రగ్రంథములందును, ధర్మాధర్మములను పేర్కొను పురాణములందును, ఆరోగ్యవిధులను దెలుపు వైద్యగ్రంథములందును మనుష్యులు ఉత్తరపువైపుగా తలపెట్టి పరుండరాదని విధింపబడియున్నది, చూడుడు :—

1. తే. తూర్పుదక్షిణములలోన దొరకినట్టి
దిక్కు తలగడగాఁగ నిద్రించెనేని
మేలు తక్కినదిక్కులు మేదినీశ!

యధిక రోగంబులు గావించు ననిరి బుధులు.

(ఆంధ్రవిష్ణుపురాణ చతుర్థాశ్వాసము.)

2. "ప్రాచ్యాంవా దక్షిణాయాంవా శిరఃకృత్వా స్వపేద్గృహీ"

(చర్యాచంద్రోదయము.)

3. "నకదాచిదుదక్శిరాః"

(మానవధర్మచంద్రిక.)

4. "ప్రాచ్యాందిశి శిరశ్శస్తం యామ్యాయా మథ వానృప, సదైవస్వపతః పుంసోవిపరీతంతు రోగమితి విష్ణుపురాణేఽభిహితత్వా దుత్తరదిశ్ శిరస్థిత స్వపనం రోగహేతుత్వా ద్దృష్టఫల మేవ. దిక్సాధనయంత్ర వర్ధ్రుకనక్ష్రేణ శిరోగత బుద్ధ్యాకర్షణా దుక్తార్థో భవతి. ప్రాయేణోన్మత్తా స్స్వపంత్యుదీచీస్థిత మస్తకా యేవ"

(మునిభావబోధిని.)

నిద్ర వైష్ణవమాయ. సుఖదుఃఖములు నిద్రాయత్తమై యున్నవి. మంచినిద్ర ఉన్నచో, శరీరము, మనస్సు కూడా ఆరోగ్యముగాను, ఆనందకరముగాను ఉండి, రెంటియొక్క పొందు రాణించును. లేదా మతి భ్రమ కలిగి శరీరము యెక్కువకాలము మనజాలదు. సుఖమునిచ్చు నిద్ర నియమబద్ధమై యున్నచో శరీరారోగ్యమునకు మరింత మేలును గూర్పగలదు.

మన శరీరమునకును, భూమికిని యెడ తెగని సంబంధముకలదు. భూమినుండి మనుష్యునకు కొన్నిశక్తులు సంక్రమించుచున్నవి. తేజోరాశియగు సూర్యునివలన భూమి యెప్పుడును శక్తిసంపన్నమగుచుండును. భూమి గుండ్రముగా నుండుటవల్ల సూర్యతాపముచే పూర్వార్ధగోళము తపింపబడినదై, పశ్చిమార్ధగోళము శీతలముగనే ఉండును. అప్పుడు సూర్యతాపజనకమైన ఉష్ణశక్తి (Thermal electricity) భూమ్యోపరిభాగమునుండి క్రమముగా పశ్చిమార్ధగోళమునకు వ్యాపించుచుండును. భూమి ప్రతివస్తువును ఆకర్షించుచున్నదని పదార్థవిజ్ఞానశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. మన శరీరములు గూడ ఎప్పుడును భూమివల్ల ఆకర్షింపబడుచునే ఉండును. దీనికి ఆధారముగా ఇతర కారణములతోబాటు మనరక్తమున ఎక్కువ భాగము లోహము ఉండుటగూడ కారణమే అగుచున్నది. నిరాధారముగా మనము నిలువలేక భూమిమీద పడుచుండుటచేత, భూమి నిరంతరము మనల నాకర్షించుచున్న సంగతి ఒకవిధముగా గమనించుచునే ఉన్నాము.

అయస్కాంతము, దాని ఆకర్షణశక్తి అందరెరింగియే యున్నారు. అయస్కాంతమును దెచ్చి వ్రేలాడగట్టిన దీనికొన లెప్పుడును ఉత్తరదక్షిణములే చూపుచుండును. దీనిచెంతకు మరియొక అయస్కాంతపు కొనలను దెచ్చినయెడల ఒకటి ఆకర్షించుటయు, రెండవది నిరాకరించుటయు మనము చూడగలము. ఉత్తరపువైపుకొన ఉత్తరధ్రువమనియు, దక్షిణపువైపుకొన దక్షిణధ్రువమనియు తెలియవలయును. ఉత్తరధ్రువము దక్షిణధ్రువము నాకర్షించుటయు, ఉత్తరధ్రువమును నిరాకరించుటయు– అట్లే దక్షిణధ్రువము, ఉత్తరధ్రువము నాకర్షించుటయు, దక్షిణధ్రువమును నిరాకరించుటయు మనము ప్రత్యక్షముగా కనుగొనగలము.

కాబట్టి భూమి మనశరీరముల నాకర్షించుచున్నదనగా, భూమియొక్క ఉత్తరార్ధగోళమునమున్న, ఉత్తరధ్రువము మానవుని శరీరమునకు దక్షిణధ్రువమగు పాదములను ఆక

ర్షించును. ఉత్తరధ్రువమగు శిరమును నిరాకరించును. మానవశరీరమునందలి ధ్రువనిర్మాణమును, భూగోళముయొక్క ధ్రువనిర్మాణము ననుసరించియేయుండి, పరస్పరాశ్రయమువలన ఆరోగ్యవర్ధకమగుచున్నది.

మనము పరుండునపుడు తలను దక్షిణముగాను, కాళ్లు ఉత్తరముగాను ఉంచి పరుండినచో భూమియొక్క దక్షిణధ్రువము మన శిరమును, ఉత్తరధ్రువము మనరెండుకాళ్లను ఆకర్షించుచుండు నందువల్ల శరీరముయొక్క ధ్రువాభిముఖతయు కాపాడబడి పరస్పరాకర్షణముచే గలుగు ధాతుసామ్యతవలన శరీరము వ్యాధులపాలు కానేరదు. సహజముగా నిట్టి ఆకర్షణశక్తిచే గలుగు ధ్రువాభిముఖతయే మనుష్యులకు ఓజోవర్ధకమై, ఉత్సాహోత్తేజములను కలిగించుచుండును. కారణము తెలియకపోయినను మానవులకు మరణకాలమాసన్నమైనపుడుగూడ 'భూశయనము'ను ఆచారము, మన హైందవగృహములందు గలదు. మంచముమీద ప్రాణములను వదలుటకు హిందువు లంగీకరింపరు. భూశయనమున గూడ వీలు వెంటపరుండబెట్టనీయరు. ఉత్క్రాంతిసమయమున శరీరమును మంచముమీదినుండి క్రిందికిదించి, దక్షిణతలాపిగా పరుండబెట్టు ఆచారముగూడ పయి విషయలనే దృఢపర్చుచుండుటచేత, కేవలము వీటిని పిచ్చిగా తలంచి త్రోసిపుచ్చుట భావ్యము కాదని మనము గ్రహింపవలసియున్నది.

విద్యుత్‌శక్తిని ఒక శరీరమున ప్రసరింపజేసినచో, ఆశక్తి ప్రవేశించు భాగమునగల ప్రకోపమును తగ్గించి, నిర్గమించు భాగమున ప్రకోపమును గలుగజేయుట దాని స్వభావము. తూర్పువైపు తలాపిపెట్టి పరుండినచో భూమిమీద తూర్పునుండి, పడమరకు ఎడతెగక ప్రసరించు ఉష్ణజనకమైన విద్యుత్ ప్రసారము, మనశరీరమునుండిగూడ తలనుండి కాళ్ళకు ప్రసరించి తలలోనున్న ప్రకోపమునంతను తగ్గించుచుండును. అందువల్ల మెదడు చురుకుగా పనిచేయగలుగును. కొందరు పిచ్చివారు సాధారణముగా ఉత్తరవైపుగాగాని, పడమరవైపుగాగాని తలనుంచి పండుకొనెదరని కొందరు వ్రాయుచున్నారు. ఈవిషయము నింకను పరిశీలింపవలసియున్నది.

ఈ పయివిషయములనుబట్టి తూర్పుగాగాని, దక్షిణముగాగాని తలపెట్టి పరుండుట శ్రేయస్కరమనియు; ఉత్తరముగాగాని, పడమరగాగాని తలపెట్టి పరుండుట హానికరమనియు మన ప్రాచీనాచారమునకుగల అంతరార్థము వెల్లడియగుచున్నది.

# మధ్యాహ్నం ముద్దు

[చేసుకున్న పెళ్లాం : చేసుకోతలచిన పెళ్లాం]

రచయిత:
తోలేటి గంగాధరము ఎం. ఏ.

[గతసంచిక తరువాయి]

ఇక నాసంగతి. నేను శుద్ధ పిచ్చివాడిలా అయిపోయాను. లూసీకన్య మాట్లాడినప్పుడల్లా నాబళ్లు గరిపొడిచేది. మేము ఇద్దరం ఒకర్నిఒకరం ప్రేమించుకున్నాం. ఆసంగతి మాయిద్దరికీ తెలుసు. కాని ఆసంగతిని మాత్రం ఒకరితో ఒకరం చెప్పుకోడానికి మాయుదాసిగ్గు పెద్ద అడ్డుగావుండేది.

ఇల్లాగే కొద్దిరోజులు గడిచిపోయాయి. లోకానికి నేను ఇంకా ఆమెయజమానినే, ఆమె ఇంకా నావద్ద టైపిస్టుగరలే. కాని ఒకానొక విద్యుత్తరంగము మాయిద్దరినీ దగ్గరకు లాగుతూన్నట్లుగా కనిపించేది. ఆమె వలని వలపుతో వసివాళ్లు వాడుచున్నట్లు నేను తెలిసికోలేను. ఆమెదగ్గరఉంటే నాబళ్లు గరిపొడిచేదనీ, ఏదో అవ్యక్తమైన ఆనందం నన్ను ముంచెత్తేదనీమాత్రం నేను తెలుసుకున్నాను. కాని నాకు చొఅవలేకపోయింది. పైగా నీచత్వం, తుంటరితనం ఎరగని కారణంచేత నేను ఆమెకు నాప్రేమను తెలుపలేకపోయేవాడిని.

నాపిచ్చిప్రవర్తనకు, నాసందిగ్ధస్థితికి నాలో నేనే నిందించుకొనేవాడిని. అనాటి మధ్యాహ్నం ముద్దుతో నన్ను ముంచెత్తిన ప్రేమప్రవాహముయొక్క ధాటికి నేను ఎదురొడ్డి నిలవలేక పోవుచున్నాను. లూసీకన్య నావిషయంలో బహుశ్రద్ధగావున్నట్లు తెలిసికోగలిగాను. వలపులోఉన్నవారుమాత్రం తెలిసికోగల ఎన్నోచిహ్నాలు ఆమె నాయందు మమకారంతో వున్నట్లు నిరూపించాయి.

కాని ఈప్రేమకు ఎదురొడ్డాలనే నేను కొంతకాలం ప్రయత్నించాను. ఈప్రేమవల్ల మాయిద్దరికీకూడా కష్టాలువస్తాయని నాకు తెలుసు.

అయినా ఒకనాటి మధ్యాహ్నం ఇక నేను ఉండబట్టలేకపోయినాను. నా నరాలు ఉద్రేకంతో ఉబుకులాడుతున్నాయి.

అప్పుడు తనధోరణిలో టైపుచేస్తూవున్న లూసీకన్యనుపిలిచి చికాకుగావుంది. కార్లో షికారుపోదాము రమ్మన్నాను.

ఆమె ఏమీ అడ్డుచెప్పలేదు. నావెంట కారుదాకావచ్చింది. నాతోపాటు కారు ఎక్కింది. నేను కారు పూనమల్లిహైరోడ్డుమీదుగా పోనిచ్చాను.

చీకటిపడ్డట్టు తెలిసేవరకు ఆకారు అట్లా ఆరోడ్డువెంట పోతూనేవుంది. కారు వేగంగా పోతూవుండడంచేత గాలి లోనికి విసురుగా వచ్చేది. గాలి పోసుకోవడంతో నాచికాకు చాలావరకు తగ్గింది. నాలో ఏదో నూతన చైతన్యమున్నా కలిగింది. లూసీదగ్గరగా చేరాలని తహతహ పడుచున్నాను. విభావరీ

కాని లూసీకోరకు ఎట్టి త్యాగమన్నా చేయాలి. నేను ఆమెను గాఢంగా ప్రేమించాను. ఆమెను వదిలివుండడం బహుకష్టం. నాతలంపులు ఈమాదిరిగావుండేవి.

లూసీమాత్రం చాలాశాంతంగావుండేది. నేనుపొందుతూవుండిన ఆనందం ఆమెకూడా పొందుతూవున్నట్లుగా నాకు ఎందుచేతనో తోచలేదు. కారు ఆమె యింటిముందు ఆపి ఆమెను దిగవిడుస్తున్నాను. ఆమె రెండుచేతులూ నా మెడకు చుట్టింది. మాయిద్దరి పెదవులూ కలుసుకున్నాయి. ఆమె చెక్కిళ్ళనుండి అశ్రుధారలు కారుతూవుండడము నాకు అప్పుడు తెలియవచ్చింది.

'లూసీ! ఇదేమిటి? ఇట్లానీవు కళ్ళనీళ్లు పెట్టుకోవడం ఏమీ బాగాలేదు. నాకు నీవూ, నీకు నేనూ దత్తంఅయిపోయిన తరువాత కూడా నీవు ఇల్లా విచారించడం బాగా లేదు' అని మృదువుగా అన్నాను. ఆమె ఇంట్లోకి వెళ్ళడానికి తిరుగుతూవుండగా తిరిగి రేపు ఉదయాన్ని కలుసుకుందామని నేను అన్నాను.

ఆమె తిరిగి నావైపు తిరిగింది. నాదగ్గరకు వచ్చింది. నన్ను తిరిగి ముద్దు పెట్టుకుంది. ఏమీ మాట్లాడలేదు. నన్ను పేరెట్టి పిలిచి సెలవు అంది. ఆమె వెళుతూవుండగా వెలువడ్డ నిట్టూర్పు చాలా దీర్ఘమైందిగాను, జాలి పుట్టించేదిగాను ఉంది.

ఆమె ఈప్రవర్తన విచిత్రంగావుంది. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. కాని ఆమందానందములో మునకలు వేస్తూవున్న నేను ఆమె విచిత్రప్రవర్తనగురించి వెంటనే మరిచిపోయాను.

మరునాడు ఉదయాన్నే ఆఫీసుకుపోతూ పూలఅంగడిదగ్గర ఆగి మేలురకం చేమంతి పువ్వులుకొన్నాను. పువ్వులతో నేను ఆఫీసులో లూసీరాకకోఅకు ఎదురుచూస్తూవున్నాను. నాతహతహలో నేను చాలా పెందరాలే లేచివుంటాను. ఆఫీసుకుకూడా చాలా పెందరాలే వచ్చి ఉన్నాను. కాబట్టే వేచివుండడానికి చాలాకష్టమైంది. నిమిషం ఒకయుగంలావుంది.

ఇల్లాంటి పరిస్థితుల్లో తొమ్మిదిగంటలకు లూసీరాక ఒక నడిమివయస్సు స్త్రీని పంపినపుడు నేను పొందిన ఆశాభంగం, నిరుత్సాహం వర్ణింపలేరముకానివి. వచ్చిన ఆమె నా చేతికి ఒకఉత్తరం ఇస్తూ 'లూసీకన్య మీకు ఇమ్మన్నది' అని అంది.

ఉత్తరం అనడంతోటే నాకు ఎందుచేతనో కాని అందులో ఏదో అశుభవిషయం వున్నదని తోచింది. అందుకుని ఉత్తరంవిప్పి చదివాను. ఇల్లావుంది.

'ప్రియా!

నిన్నరాత్రి జరిగిన సంఘటనం తరువాత నేను ఇంక మీ ఆఫీసులో పనిచేయడం దుస్తరంగా నాకు కనిపిస్తూవుంది.

నేను మిమ్మల్ని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. కాని మీరు వివాహితులు. మీకు ఒకభార్యగలదు. ఆమెకు మోసం చేయడం నాతలపుకాదు. ప్రస్తుతపు ఉద్యోగంలో నేనువుంటే మనం నిత్యం కలుసుకుంటూ వుండాలి. ఇప్పుడు మనహృదయాలు ఉన్నతీరులో రోజూ కలుసుకుంటూ వానిని పవిత్రంగా వుంచుకోవడం చాలాకష్టం. మనం మానవమాత్రులం. జితేంద్రియులం కాము. కాల్చుకోకుండా నిప్పుతో ఎచ్చన్నకాయలు ఆడలేం.

మీవద్దకు నార్టన్ సతిని పంపుచున్నాను. ఈమె మంచిటైపిస్టు. ఈమెపని మీకు నచ్చినచో నాఉద్యోగం ఈమెకు ఈయండి. ఈమె పనికోసం దేవుళ్లాడుతూవుంది.

భగవంతుడు మీకు సర్వదా శుభాన్ని, జయాన్ని కూర్చును గాక అని ప్రార్థిస్తూ వున్నాను.

—ఇట్లు, లూసీ.'

ఈ ఉత్తరం చదవడంతోటే నాస్థితి మారిపోయింది. ముఖకళ, భావాలతీరు మారిపోయింది. అయినా అవివేవీ పైకి కనిపించకుండా నార్టన్‌సతిని ఉద్దేశించి లూసీని గూర్చి ఆమెకు ఏమి తెలుసునో అని అడిగాను. ఆమె చెప్పుకొచ్చింది :

"నేనూ లూసీ ఒకయింట్లోనే వేరువేరు వాటాల్లో కాపరంవున్నాము. నేను ఉద్యోగం కోసం దేవుళ్లాడుతూవుండడము లూసీకి తెలుసు. ఈవేళ చీకటితోనే లూసీ నాగదికి వచ్చింది. ఏదేనా ఉద్యోగంచూపిస్తే వెళతావా? అని నన్ను అడిగింది. తాను చెప్పబోయేది చాలా ఉత్తమమైన ఉద్యోగమనీ, యజమాని చాలా ఉత్తముడు, శాంతమూర్తి, దయార్ద్రహృదయుడూ అనీ చెప్పింది. రెండునెలలుగా ఏపనీలేక అల్లాడుతున్నాను. కాబట్టి నేను ఆమెను ఈవిషయంలో ఏమీ ప్రశ్నలు వెయ్యలేదు. వెంటనే అంగీకరించి ఆమెయిచ్చిన ఉత్తరంపుచ్చుకుని నేరుగా ఈ చిరునామాకు వచ్చినాను.'

కలిగిన ఆశాభంగముతో నేను అతలాకుతలం అవుతూవున్నా పైకిమాత్రం గంభీరంగా నార్టన్‌సతి ఇదివరకు పనిచేసిన కంపెనీల దరియాప్తు చేసి, ఆమెకుగల యోగ్యతాపత్రాలు పరిశీలించాను. అంతా తృప్తికరంగా వుంది. పరీక్షార్థము ఆమెచేత కొంత టైపు చేయించాను. ఆమెచేశిన టైపుకూడా బాగా నేవుంది. అందుచేత ఉద్యోగంలో ఆమెను నియమించాను, ఆమెకు పని అప్పగించాను. నేనుమాత్రం ఆకాశంవైపు శూన్యదృక్కులు బఱువుతూ కూర్చున్నాను. నాకు మతి మతిలో లేదు.

నావలని ఆకర్షణనుండి, మనోవికారహేతువునుండి తప్పించుకొనిపోవుటకు లూసీ చేసిన ఈపనికి నాకు చాలా కోపంవచ్చింది. నేను ఆమెను ప్రేమించానననే సంగతి తాను తెలిసికొన్నవెంటనే ఆమె నన్ను వదిలేసింది. స్త్రీవలని సుఖానికి నేనునోచి పుట్టలేదేమో! నాపై ఆమెకు ఉన్నప్రేమను చూపడానికి లూసీ అపసవ్యమార్గాన్ని అవలంబించింది.

సరే. ఆమెభోగట్టా తెలిసికోడానికి ఇకమీదట నేను ఏమీ ప్రయత్నించను. నన్ను ప్రేమించడానికి అంగీకరించే ఇతరస్త్రీలు ఉండనేవున్నారు. నాతలపులు ఈతీరున సాగినవి. తోడనేలేచి నిలుచున్నాను. పూలఅంగడినుండి తెచ్చిన చేమంతిపువ్వులన్నీ ఆఫీసుగదినిండా విరజిమ్మివేశాను.

నార్టన్‌సతి నాకేసి ఆశ్చర్యంగాచూస్తూ ఇదేమిటని అడిగింది.

నామనస్సు ఏమీ బాగాలేదని సమాధానంచెప్పి తిరిగి కుర్చీలో కూలబడ్డాను. ఆమె పాపం లేచి అతిశ్రద్ధగా ఆ పూవులన్నీ ఏరితెచ్చి ఒకబల్లమీద ఉంచింది.

రోజల్లా నా మనస్సు అల్లకల్లోలంగా వుంది. చివరకు కారు లూసీయింటికి పోనిచ్చాను. ఆమెను చూడాలనే తహతహలో ఆమెమీదవచ్చిన కోపమంతా మటుమాయమైంది.

కాని నాకు ఆశాభంగమే కలిగింది. లూసీకొరకు విచారింపగా ఆమె ఆనాటి ఉదయాన్నా వేరేతావుకు కాపరంవెళ్ళిందనీ చిరునామా తెలిపివుండలేదనీ ఇంటి యజమానురాలు చెప్పింది.

ఇంకా ఆమె చెప్పింది : 'ఆమెమనస్సు

ఎందుచేతనో అతలాకుతలం అవుతూవుండి నట్లు కనిపిస్తుంది. ఆమె దేనికోరకో మన స్సులో వ్యథపడుతూన్నట్లు తోస్తుంది. ఉత్త రాలు ఏమన్నావస్తే పోస్టుఆఫీసుకు పంపించి వేయమంది. ఆమె చాలా మంచిమనిషి. కళ కళ్లాడేముఖంతో ఎప్పుడూ ఆనందంగావుండే ది. ఆమె ఇక్కడినుంచి వెళ్ళిపోయినందుకు నాకే ఏమిటో చాలా బెంగగా వుంది.'

దిక్కుమాలిన దౌర్భాగ్యస్థితిలో ఉన్న ట్లనిపించింది నాకు. తిరిగి ఆఫీసుకుపోయి నాను. నాభావాల్ని ఉత్తరంద్వారా ఆమెకు తెలుపుకున్నాను.

ఆమెతిరిగి వచ్చినట్లయితే నేను నాభార్య వల్ల విడాకులుపొంది ఆమెను పెళ్లాడుతాననీ ఆమెనువదిలి నేను ఒక్కక్షణమేనా జీవించ లేననీ వ్రాశాను ఆ ఉత్తరం పోస్టుఆఫీసుకు పంపాను.

లూసీపై నాకువచ్చిన కోపమంతా తగ్గి పోయింది. ఆమెపై నాకుగలప్రేమ మరింత అతిశయించింది. నానుండి తప్పించుకునిపోవ డంలో ఆమెకుగల సదుద్దేశం నాకు అవగతం అయింది. ఆమెను హెచ్చుగా ప్రేమించడా నికే కాకుండా శ్లాఘించడానికికూడా నాకు కారణం కనిపించింది.

కాని నా నిజస్థితి లూసీకి తెలియదు. నేనే మో పెళ్లాంతో అందరిలాగే సంసారసుఖం అనుభవిస్తున్నవాడినే అనేభావం ఆమెకు ఉంది. తాను ముద్దుపెట్టుకున్న కారణంచేత నామనస్సు చలించిందనీ దానితో ఈ కష్ట మంతా కలిగిందనీ ఇకమీదట తాను ఇల్లా నిప్పుతో చెలగాటము ఆడకూడదని నిశ్చ యించుకొని నాకుపెడగా తొలిగిపోయిందనీ నేను తెలుసుకున్నాను.

రోజులు వెళ్ళిపోతూవున్నాయి. నాకు ఆమెజాడ ఏమీ తెలియలేదు. నా ఉత్తరా నికి ఆమె జబాబన్నా వ్రాయలేదు. ఉండ బట్టలేక ఆమెకోసం తీవ్రమైన అన్వేషణ ప్రారంభించాను. దూరాన్నుంచి ఎవరినో ఒకయువతిని చూస్తూవుండడం; ఆమెయే లూసీ అనుకుంటూవుండడము, తీరా దగ్గరకు పోయిచూస్తే ఆమె లూసీ కాకపోవడం తలు చుగా సంభవిస్తూవుండేది. అట్టిసమయాల్లో నాగుండె అతితీవ్రంగా కొట్టుకుంటూవుండేది.

ఈ సమయంలో సరోజిని నా చికాకు చీదర చూచి, నేను ఆమెయందు చూపించే విముఖత్వం చూచి నాకు ఆనందంకలిగించడా నికి అనేకప్రయత్నాలు చేసేది.

ఒకనాటిరాత్రి చికాకుగా వుండడంచేత యింటికిరావడంతోటే బట్టలుమార్చేసి మం చంమీద పడుకున్నాను. తీవ్రమైన తలపులతో నామనస్సు ఉడుకెత్తుతూవుంది. ఇంతట్లో తలుపు తెఱచుకొని సరోజిని నా యెదుట ప్రత్యక్షమైంది. ఆమె ఉల్లిపొరవంటి సన్నని గాను తొడుక్కునివుంది. ఆమె అంతటి సన్న బట్ట కట్టుకోవడం నేనుఎప్పుడూ చూడలేదు. దీపంవెలుగులో ఆ సన్నబట్టలోనుంచి ఆమె శరీరంఅంతా నాకు కనిపిస్తూంది.

నాకు చాలా ఆశ్చర్యంవేసింది. నీకు ఏం కావాలని అడిగాను. మా పెళ్లిఅయి రెండేళ్లు అయింది. ఆమె అట్టిదుస్తులు కట్టుకోవడం, ఆమాదిరిగా నాదగ్గరకురావడం అదే మొద టిసారి.

'ఏమీలేదు. ఏదో పిచ్చాపాటీ మాట్లాడు కుందామని వచ్చాను. మీరీమధ్య సరిగా ఇంట్లోనే వుండటంలేదు. మీతో మాట్లాడు కోడానికే అవకాశంలేకుండా వుంటూవుంది.' అంటూ మందహాసముచేస్తూ ఆమె పరుపు మీద నాదగ్గిరిసా కూర్చుంది.

సాగుతూవున్న నా తలపులకు నిరోధం రావడంతో నాకు శాంతం నశించింది. పైగా చికాకుకూడా పుట్టుకొచ్చింది. సరోజిని సౌందర్యమేమీ అప్పుడు నన్ను ఆకర్షించలేదు.

ఉబ్బెత్తుగా ఆమె నామీద చెయ్యి వేసింది. మన ఇద్దరినడుమా సామరస్యం మరో విధంగా వుండివుంటే బాగుండేది అంటూ ఆమె నన్ను లాలించడానికి ప్రారంభించింది.

అప్పటి నా ఉద్రిక్తస్థితికి ఆడదాని కౌగిలియేమందు. అయినప్పటికీ ఆమెను కౌగలించుకోవాలనే తలంపే నాకు కలగలేదు. ఒకవేళ నేను కౌగలించుకున్నా ఆమె ఆ కౌగిలిలో ఇమిడివుండదనీ ఇమిడివుండాలని ఆమెమనస్సులో అనుకున్నా ఇమిడివుండలేదనీ నాకు తెలుసు. ఎంతప్రయత్నించినా నేను కరగనందుకూ, చిక్కనందుకూ ఆమెకు తారామండలాన్ని కోపంవచ్చింది. పరుపు మీదనుంచి లేచిపోయి నిలబడి 'నాకు తెలిసిందిలెండి! మీకు ఓ గుడిసేటిదానితో సంబంధం ఏర్పడింది' అని గింజుకుంటూ పలికింది.

'సరోజినీ! నీవు బాగా దురభిప్రాయపడుతున్నావు. నేను ఏమీ ఓ గుడిసేటిదానికి ఇలాకా పడలేదు. కాని నీదగ్గర నింజం దాచడం నాకేమీ ఇష్టంలేదు. మన ఇద్దరినడుమా దాంపత్యధర్మం నడవటంలేదు. ఒకరికి ఒకరం చాలాదూరమైపోయాము. కాబట్టి ఈపరిస్థితుల్లో నేను మరోస్త్రీని ప్రేమించవలసి వచ్చింది. నన్ను పెళ్లాడ్డానికి ఆమె అంగీకరిస్తే నీవు నాకు విడాకు ఇవ్వడానికి అంగీకరించవలసివుంటుంది' అని అన్నాను.

సరోజినిముఖం కందగడ్డలా ఎర్రబారిపోయింది. కోపదేవత ఆమె ముఖంమీదనే వలస ఏర్పరుచుకున్నదా అనిపించింది. చిందులు తొక్కుతూ ఆమెఅంది: 'విడాకు! మీరు ఆమాట మళ్ళీ తలపెట్టండి. మీ పరువు ప్రతిష్ఠలు కూలద్రోయకపోతే చూడండి. ఆస్త్రీని కూడ కోర్టుకు ఈడవకుండా వదిలిపెడితే అనండి. పెళ్ళిచేసుకుని ఒక పెళ్లాంతో కాపరం చేస్తూవున్న మగవాణ్ణి సామాన్యస్త్రీ ఎవ్వత్తీ చేరనియ్యదు. అన్నింటికీ తెగించిన చెడిపి ఎవత్తో మీతో పొత్తుకలిపింది. ఆ తొత్తును చూసి మీరు మురిసిపోతున్నారు. మీకూ నాకూ పెళ్ళిఅయింది. ఈ పెళ్ళికి విచ్ఛేదం అంటూ వుండకూడదు.'

ఇల్లా అంటూ చంటిపిల్లమాదిరిగా వెక్కివెక్కి ఏడుస్తూ ఆమె గదిలోంచి వెళ్ళిపోయింది.

నేను నిశ్చితభావంతోను, ధైర్యంగాను విడాకువిషయంలో సరోజిన్ని గట్టిగా అడిగి వుండవలసింది. అటోఇటో అప్పుడే తేల్చుకొని ఉండవలసింది. కాని నేను కీర్తికాముకత్వానికి దాసుణ్ణి అయిపోయాను. విడాకు అనడంతో ఓ నలుగురిలో నామోషీ అవుతుందేమోనని చాలా భయపడ్డాను.

వేసవి వెళ్ళిపోయింది. వర్షాకాలంకూడా చల్లగా జారింది. వుండువంటి శీతాకాలం వచ్చిపడింది. లూసీని చూడాలనే తహతహ నాలో అంతకంతకు అగ్గలమైపోతూవుంది.

ఇల్లా ఉంటూవుండగా ఒకనాటి సాయంకాలం వర్షంపడుతూవుంది. నేను ఓ కాఫీ హోటలులోనుంచి బయటికి వస్తూవున్నాను. రెయిన్‌కోటు తొడుక్కుని; కళ్లు, ముక్కు తప్ప మిగిలిన ముఖాన్నిఅంతా కప్పేసే రెయిన్ ప్రూఫ్ టోపీ పెట్టుకుని లూసీ ఆ దారిని వెళుతూవుంది. ఆమెదర్శనంకోసం కాయలుకాచివున్న నాకళ్ళు ఆమెను పట్టేశాయి. లూసీ, లూసీ అని పిలుస్తూనే నేను

ఆమెచెయ్యిపట్టుకున్నాను. ఆమె నాకేసి చూచింది. కళ్ళు తెల్ల బారివున్నాయి. ఆమె చేతిని నాజబ్బకు ఒరసిపట్టుకున్నాను. ఆసమయంలో నాకళ్లల్లో గిర్రున నీళ్లుతిరిగాయి. వాటిని బయటికి రానియ్యకుండా కళ్లల్లోనే ఇగిరిపోయేటట్లు చేశాను.

అట్లు చెట్టాపట్టాలు వేసుకునీ మేము నడుస్తున్నాము. ఆమె తన సంగతి కొద్దిగా చెప్పింది. తానిప్పుడు హిగిన్ బాతమ్సు వారి పుస్తకశాలలో పనికి కుదిరివుంది. కాపరం అలందూరులో. సావకాశంగా మేము కూర్చుని మాటలాడుకోవడానికి వీలయిన ప్రదేశానికి పోదామన్నాను. ఆమె అలందూరుపోవాలనీ; మదరాసుకు అది కొంతదూరంలో వుండడంచేతనూ, పైగా వర్షంగా వుండడంచేతనూ పెందరాలే ఇంటికిపోవడం వాంఛనీయమనీ ఆమెఅంది. నాకారులో ఆమెను అలందూరు తీసుకుపోయి దిగవిడుస్తానన్నాను. ఆమె అంగీకరించింది. చెయ్యి ఊతయిచ్చి ఆమెను కారులోకి ఎక్కించాను. కారు పోతూవుంది.

నేను ఆమెముఖంకేసి నిదానించి చూచాను. ఆమె బాగా చిక్కిపోయివుంది. కళ్లు దుఃఖాన్ని సూచిస్తున్నాయి. అయినా నన్ను కలుసుకున్నందుకు ఆమెకు కలిగిన ఆనందాన్ని ఆమె ఎంత ప్రయత్నించినా దాచుకోలేక పోయింది. నేనువ్రాసినవుత్తరం ఆమెకు చేరిందనీ, నన్ను మరిచిపోవడానికి ఆమె చేసిన ప్రయత్నంలో దానికి జవాబువ్రాయకుండా వుండడం మంచిదిగా ఆమెకు తోచిందనీ ఆమె చెప్పింది.

'నాకు మానవస్వభావం కొంత తెలుసు. మన ప్రస్తుతపరిస్థితుల్లో మనం ఒకచోట వుంటే, రోజూ ఒకచోట పనిచేస్తూ మసులుతూవుంటే మీభార్యను మోసంచెయ్యకుండా వుండడం అసంభవమని నాకు తెలుసు.' అని ఆమె చెప్పింది. చెపుతూ నిట్టూర్పువిడిచింది. ఇంకా చెప్పడానికి ప్రారంభించింది.

—సశేషము.

## బర్మాఖండములో

'ఆంధ్రభూమి'కి ఆయాస్థలములందు దిగువను పేర్కొనబడినవారు ఏజెంట్లుగ నున్నారు. ఆంధ్రులు విరివిగగల బర్మాఖండములోని మిగిలినభాగములందు 'ఆంధ్రభూమి'కి ఏజెంట్లు కావలసియున్నారు. కావున ఏజెంట్లుగ ఉండగోరువారు షరతులకై వ్రాయ ప్రార్థించుచున్నాము.

1. రంగూన్ — శ్రీయుత ఎ. సత్యనారాయణరావుగారు; జనరల్ మర్చెంటు అండ్ కమీషన్ ఏజెంటు - నెంబరు 141, మొగల్ స్ట్రీట్.
2. మౌల్మేన్ — శ్రీయుత బి. సుబ్రహ్మణ్యముగారు; నెంబరు 187, లోయర్ మెయిన్ రోడ్.
3. హెంజడా — శ్రీయుత ఆర్. సూర్యనారాయణగారు; నెంబరు 11, కోర్టు హౌస్ రోడ్.

# దయచేసి గెడ్డాలు పెంచండి

[ఈ విన్నపం మగవాళ్ళకి మాత్రమే]

రచయిత:

ఎ. శేషాచలపతి, బి. ఏ.

ఇప్పుడు ఎక్కడచూసినా ఒక్కొక్క మనిషి ఒక్కొక్క ఉద్యమాన్ని లేవతీస్తూ దాన్నిగురించి తీవ్రప్రచారం చేయడం రివాజు అయిపోయింది. గొల్లపూడి సీతారామశాస్త్రిగారు అందరూ దంపుళ్ళబియ్యం తినాలనే ఉద్యమాన్ని లేవతీశారు. టీసెస్సు కమిటీ వారు అందరూ ఇండియాటీ తాగాలిఅనే ఉద్యమాన్ని సాగిస్తున్నారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు ప్రబుద్ధాంధ్ర మానివేశాక వేరేపనిలేక ఆంధ్రులందరూ జొన్న అన్నం తినాలనే ఉద్యమప్రచారానికి దొరకొన్నారు. ఇక గాంధిగారు సరేసరి. గ్రామసీమల్నిగూర్చిన ఉద్యమంలో ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. మనల్ని ప్రస్తుతం పరిపాలిస్తూ వున్న వైస్రాయిగారు ఆంబోతుల్ని పెంచాలంటూ ప్రచారం సాగిస్తున్నారు. ఇవన్నీ చూసి నాకుకూడా ఏదేనా ఉద్యమం లేవతీద్దామని బుద్ధిపుట్టి ఆలోచించి ఆలోచించి అందరిచేతా గెడ్డాలు పెంచించే ఉద్యమం లేవతీస్తే బాగావుంటుందని నాకు తోచింది. ఏ ఉద్యమంఅయినా బాగా ప్రచారంలోకి వచ్చి బహుజనామోదం పొందాలంటే ఆ ఉద్యమం అవలంబించడానికిగల కారణాలు ప్రజలకు బాగా తెలియాలి. కాబట్టి గెడ్డాలు పెంచడానికిగల కారణాల్ని అన్నిటినీ ఇక్కడ ఒక్కొక్కటీ వివరిస్తాను.

భారతదేశం ఆధ్యాత్మికవిద్యకు పేరుమోసిన ప్రాచీనకాలంలోని మన ఋషులంతా గెడ్డాలు పెంచినవారే. అసలు వారితపశ్శక్తీ, ఆధ్యాత్మికసంపదా, అనంతవైదుష్యమూ వారు పెంచిన గెడ్డాలమూలంగానే కలిగాయి. పావనులగు ఆఋషుల సంతతికి చెందినవారమే అయినా మనం ఏనాడు గెడ్డాలు పెంచడం మానివేశామో ఆనాటినుంచీ భారతీయుల తపశ్శక్తీ, ఆధ్యాత్మికసంపదా, అనంతవైదుష్యమూపోయి నిర్వీర్యత అంటుకుంది; పారతంత్ర్యం పైబడింది. మన పూర్వపు ఔన్నత్యం మనంపొందాలంటేనూ, మనస్వాతంత్ర్యం మనం తిరిగి పొందాలంటేనూ తిరిగి మనం మనపూర్వపు ఋషులవలె గెడ్డాలు పెంచవలిసిందే.

అదిన్నీగాక గెడ్డాలు పెంచడమనేది ఒక పెద్దదీక్ష. దానివల్ల అనుకున్నకార్యాలు నెరవేరి తీరుతాయి. ఓడిపోయేస్థితిలోవున్న వ్యాజ్యాలు ఆవ్యాజ్యందారులు గెడ్డాలు పెంచడం ప్రారంభించాక నెగ్గిన నిదర్శనాలు ఎన్నో ఉన్నాయి. బేబరు చక్రవర్తి పానిపట్టు యుద్ధంలో తను ఓడిపోతూన్నట్లు కనిపించడంతోటే అల్లాను తలుచుకొని స్వామీ నాకు గెలుపుయియ్య నేను ఇంతటినుంచి గెడ్డం పెంచుతాను అని ఒట్టుపెట్టుకున్నాడు. ఆ గెడ్డంఒట్టుతో బేబరుకు గెలుపువచ్చింది.

దీన్నిబట్టి గెడ్డంయొక్క మహాత్మ్యం ఎంతటిదో మీరు సులభంగానే గ్రహించుకోవచ్చు. వ్యాజ్యందారులు తమదావాలు నెగ్గాలన్నా, విద్యార్థులు తమకు పరీక్షల్లో జయంకలగాలన్నా, మనకు శత్రుంజయంకావాలన్నా గెడ్డంపెంచే దీక్షను మనం అవలంబించితీరాలి. ఆంధ్రులందరూకూడా ఒక్కసారి పవిత్ర హృదయులై ప్రత్యేకాంధ్రరాష్ట్రం వచ్చేవరకు గెడ్డాలు పెంచుతామని దేవుడియెదుట ఒట్టు పెట్టుకుంటే మనగెడ్డాలు పిల్లిగెడ్డాల పరిమాణానికి వచ్చేసరికి ప్రత్యేకాంధ్రరాష్ట్రం వచ్చిపడుతుంది. మేకపోతు గెడ్డంపెంచి సింహాన్ని జయించినకథ రెండవవాచక పుస్తకంలోనే అందరూ చదివివున్నారు.

అడ్డాల్లోనే బిడ్డలుకాని గెడ్డాలువచ్చిన తరువాత బిడ్డలుకారని మనలో ఒక సామెత వుంది. దీనినిబట్టి గెడ్డంవుండడంతోటే మనిషి పెద్దవాడిక్రింద పరిగణింపబడతాడని నిశ్చయమౌతూవున్నది. మనకు పెద్దమనిషితనమూ, దానివల్లను ఒనగూడే లాభాలూ, గౌరవాలూ పొందాలంటే గెడ్డాలు పెంచడంతప్ప గత్యంతరంలేదు.

పెళ్లాలు గర్భవతులుగా వున్నప్పుడు కొంతమంది మొదటి మూడుమాసాలు గెడ్డాలు పెంచుతారు. తరవాత తీసివేస్తారు. దీనివల్ల వారిభార్యలు గర్భవతులుగా వున్నారని అందరికీ తెలిసిపోతుంది. ఇంటిసంగతులు ఇట్లా నలుగురిలో పడిపోవడం కోరతగిన విషయం కాదు. అసలు ఎప్పుడూ గెడ్డమే కలిగివుంటే భార్యలు గర్భిణులుగా వుండడంచేత గెడ్డాలు పెంచేరో ఉట్టినే పెంచేరో తెలియకుండా వుండి సంసారం గుట్టుగా సాగుతుంది. మన గెడ్డాల్నిబట్టి మనభార్యల గర్భధారణం ఇతరులకు తెలుసుకోవడానికి వీలులేకుండా చేయాలంటే మనం ఎల్లప్పుడూ గెడ్డాలు పెంచివుండడమే శరణ్యం.

గెడ్డాలుపెంచకుండా వానిని ఎప్పటికప్పుడు గొరిగించడం పద్ధతిలో వ్యయమూ, ప్రయాసకూడా యిమిడివున్నాయి. వానిని గొరగడానికి అల్పజాతివాడయిన మంగలివాని మీద ఆధారపడ్డం ఒకటి చాలాచికాకు విషయం. వాడు వేళకి రాకపోయినా, అసలు దొరక్కపోయినా చాలాఇబ్బంది. పైగా సాధారణంగా మంగళివాళ్ళ- అందులో పల్లెటూరివాళ్ళవి- కత్తులు పరిశుభ్రంగాకాని పదునుగాగాని ఉండవు. చర్మవ్యాధుల్ని కలిగించడానికి, నాట్లుపెట్టడానికి అవి సమర్థాలయి వుంటాయి. పోనీ కత్తులు, సబ్బులు మొదలయిన క్షౌరపు సామగ్రిఅంతా మనమే కొనుక్కొని వుంచుకుందామన్నా అది విశేషవ్యయమూలకం. పైగా ఏదేనా వూరు వెళ్ళితే దేవతార్చనపెట్టిలా వీన్నికూడా తీసుకుపోవాలి. గెడ్డంగీయడానికి ప్రతిసారి పదినిమిషాలన్నా పడుతుంది. ఒక్కొక్కసారి గెడ్డంమీది వెంట్రుకలనుగూర్చి పదేసినిమిషాల చొప్పున వ్యయంచేస్తే ఇరవైసంవత్సరాల సగటు ఆయుర్దాయంగల హిందూదేశంలో ఆయుర్దాయంలో తీసిపారవేయరానంతటి కాలం దీనికిందే పోతూందన్నమాట. ఇప్పుడు నాగరికుల్లో రోజూ గెడ్డంగీసుకునే ఆచారం ప్రబలివుంది. రోజుకి గెడ్డంగీసుకోవడానికి పది నిమిషాలవంతున వ్యయంచేస్తే వారానికి ఒక గంటా పదినిముషాలున్నూ, నెలకి నాలుగ్గంటల నలభై నిమిషాలున్నూ, ఒక ఏడాదికి రెండురోజుల పన్నెండుగంటల యాభై నిమిషాలున్నూ, పదిఏళ్ళల్లో మూడువారాలున్నూ వృధాపరిచినట్లు అవుతుంది. కాలం విలవ అయింది. డబ్బుపోతే మళ్ళీ గడించుకోవచ్చు. కాలం

పోతేమాత్రం ఇక కలిసిరాదు. కాబట్టి విశేష వ్యయప్రయాసలకు మూలమున్నా, కాలహరణానికి కారణమున్నా అయిన గడ్డాలు కొట్టించడమనే ఆచారాన్ని మానివేసి సర్వే సర్వత్రా అందరూ అన్నికాలాల్లోను గడ్డాలు పెంచడం వాంఛనీయం.

అసలు గడ్డమనేది శౌర్యానికి ఒకగురుతు. మన భారతదేశంలో శౌర్యం అనేవస్తువ ఇంకా దొరుకుతూవుంటే అది అకాలీ సిక్కులవద్దనే వుంది. ఆకాలీసిక్కులందరూ గడ్డాలు పెంచివుంటారనే విషయం చిన్నపిల్లలకు సమేతం తెలిసినసంగతే. అకాలీసిక్కులవంటి శౌర్యం మనకికూడా కావాలంటే గడ్డాలు పెంచడంతప్ప గత్యంతరం లేదు.

అదిన్నీగాక బెర్నార్డుషావంటి మహనీయుడు, అరవిందునివంటి యోగీశ్వరుడు, రవీంద్రునివంటి కవీశ్వరుడు గడ్డాలుపెంచి గడ్డాల మహత్తుకు సాక్షీభూతులై మీ యెదుట జీవించియుండగా మీరింకా గడ్డాల మహత్తు తెలిసికొని వానిని పెంచడానికి ప్రారంభించక పోవడం కన్నులుండీ కానకపోవడమే అవుతుంది.

మనకు ఇష్టంలేనిపనులు మనచేత చేయించాలన్నా, మనమనస్సు కరగకపోతే దాన్ని కరిగించాలన్నా మనవద్ద చనువుగలవాళ్ళకి మనగడ్డంపట్టుకుని బ్రతిమాలడం ఆచారమై వుంది. మనం గడ్డంగనక బాగా పెంచామూ అంటే ఎంత చనువుగలవాళ్లుకూడా మన గడ్డంమీద చెయ్యివెయ్యడానికి జంకుతారు. మనగడ్డం పట్టుకు మనల్ని బ్రతిమాలడానికి వాళ్ళకు అందులో వీలులేకుండాపోతుంది. అప్పుడు మనకు ఇష్టంలేనిపని మనం చేయడానికి కాని, మనమనస్సు అనవసరంగా కరిగించుకోడానికిగాని అవకాశంలేకుండా పోతుంది.

అదిన్నీగాక గడ్డంపెంచడంవల్లను మనకు కొత్త గౌరవంవస్తుంది. చిన్నపెద్ద తారతమ్యంలేకుండా మనల్ని అందరూ గౌరవిస్తారు. ఆఫీసుల్లోకి వెళ్ళినా ఆఫీసర్లు గౌరవిస్తారు. మనకు రాకపోయినా తేలుమంత్రం, పాము మంత్రం, దెయ్యాలమంత్రం వచ్చునని కాలక్షేపం చెయ్యవచ్చు.

గడ్డంవున్న ముఖాన్ని ఎవరూ మరిచిపోరు. ఆముఖాన్ని ఎక్కడచూశారో, ఎప్పుడు చూశారో కూడా వారికి జ్ఞాపకంవుంటుంది. మనపేరు తెలియకపోయినా మనల్ని గూర్చి చెప్పుకోడానికి వారికి ఇబ్బందివుండదు. 'ఆగడ్డపు ఆయన' అని మనల్ని నిర్దేశించి చెప్పుకుంటారు.

గడ్డంపెంచడానికి జితేంద్రియత్వానికి చాలా దగ్గర సంబంధంవుంది. గడ్డంవున్నమనిషి దగ్గరకు-తమకు లేకపోయిందిగదా అనే ఏడ్పు చేతనైతేనేమి, వీళ్ళకు ఉందికదా అనే అసూయచేతనైతేనేమి-స్త్రీలు తమంతతాము వలచిరారు. స్త్రీలు చెంతకుచేరకపోతే ఇక పురుషుడు జితేంద్రియుత్వం కలిగివుండడంలో ఏమికష్టం? జితేంద్రియుత్వం సాధించడానికి గడ్డంపెంచడం తిరుగులేని సాధనం.

మగవాని గడ్డంమీద వెంట్రుకలు వాటి అంతట అవే పెరుగుతున్నాయి. భగవంతుడి ఉద్దేశం అవి అక్కడ పెరగాలనే. ప్రకృతిమాత దృష్టిలో గడ్డానికి ప్రత్యేకప్రయోజనంవుంది. పురుషుడు అన్నికాలాల్లోను బయటతిరగాలి. శీతాకాలంలో మగవానికంఠం చలిచేత బిగుసుకుపోకుండానూ, ఎండకాలంలో వడదెబ్బకు గురియై కంఠం అర్చుకుపోకుండానూ వుండడానికి గడ్డంవుండితీరాలి.

అదిన్నీగాక పెరిగిన గడ్డం టాన్సిల్సును అనగా కం[illegible]లు పెరగటానికి వీలో

ధించి కంఠనాళాల్ని కాపాడుతుంది. అందు చేతనే గడ్డంవున్నవారి కంఠస్వరం కంచుగీసి నట్లుగావుంటుంది. ట్రంపెట్ వాయిస్ ఆఫ్ ఇండియాఅని బిరుదుపొందిన సురేంద్రనాథ బెనర్జీ ఉపన్యాసశక్తికి అతనిగడ్డమే కారణం. గడ్డంపెంచితే గొప్ప ఉపన్యాసకుడు కావడానికి ప్రతివానికీ మంచి అవకాశంవుంది.

మరిన్నీ గడ్డం మగతనానికి ఒక గురుతు అది మగవారి విలక్షణత. మగసింహానికి జూలు వుంది. కోడిపుంజుకు కొద్దిజుట్టువుంది. మగవానికి గడ్డంవుంది. ఆగడ్డాన్ని గొరిగించడం నాకు మగతనంలేదని చెప్పుకోవడమే అవుతుంది. తాను మగవాడినని అందరికీ తెలియజేసుకోతలచిన ప్రతీవాడూ గడ్డం పెంచి తీరవలసిందే. గడ్డంలేని మగవాని మగపోడిమినిగూర్చి ఇతరులు సందేహించడానికి అవకాశంవుంటుంది. ఇతరుల ఇట్టి సందేహానికి అవకాశంలేకుండా మన మగతనానికి నోటీసు బోర్డులా ఉండే గడ్డంపెంచడం ఎంతేనా కోరదగింది.

మానవుని శరీరంమీది అన్ని వెంట్రుకల్లోకి గడ్డంమీది వెంట్రుకలే మిక్కిలి గౌరవంగాను పవిత్రంగాను అనంతకాలంనుంచీ చూడబడుతూవున్నాయి. మహమ్మదీయులు తమప్రవక్త గడ్డంమీద గనుక ఒట్టుపెట్టుకున్నారంటే అది తిరుగులేనిది. ప్రవక్తల గడ్డాల్లోని వెంట్రుక ఒకటేనా మనవద్ద వుండడం అనంతపుణ్యప్రదమని మనవారి నమ్మకం. అట్టి గడ్డపువెంట్రుకల్ని మనం మంగలివాని కత్తికి గురిచెయ్యడం తులిసికోటలో గంజాయిమొక్క పాతడంలాంటి పాపకార్యం అని నమ్మండి. ఇట్టి పాపకార్యంజోలికి పోకుండావుండాలంటే గడ్డం పెంచడమే శరణ్యం.

ఈ కారణాలన్నిటినీ గమనించి మగవారందరూ ఇకమీద దయచేసి గడ్డాలు పెంచుతారని నమ్ముచున్నాను.



నేమన[illegible] వారి 'సీమంతిని' ఫిల్ములోని నాగలోకదృశ్యము

# మణిమాల

## మన ఆడవారి సొగసులు

మాతూర్పు గోదావరిజిల్లాలో ఆడవారు ముక్కుల నున్న అభరణములను పూర్తిగ తీసివేయుచున్నారు. చిన్నపిల్లలకి ముక్కులుకుట్టించుట మానివేయుచున్నారు. పూర్వపు నాసికాభరణముల పేర్లు అనేకము లున్నవి. వాటిఅన్నిటి పేర్లు వివరింప సాధ్యముకాదు. 'అభరణాలకల్లా ముక్కుముంగర' అను సామెత యున్నది. ఆ అడ్డబాస చాల ప్రాముఖ్యమైనదందురు. హంస, నత్తు మున్నగునవి పూర్వపు నాసికాభరణములు. ఆధునిక నాగరకతలో హంస నత్తు పోయి చాలాకాలమైనది. క్రమముగ అడ్డబాసకూడ నదృశ్యమైనది. కొన్నాళ్ళకు రెండు ముక్కుపుడకలు నికరమైన నాసికాభరణములుగా ఆచారములోనికి వచ్చెను. దానిపై అర్ధచంద్రిక కళావరు రెండు ముక్కులకువచ్చెను. తర్వాత అవిపోయి బేసరి జాలరి (లేక నిమ్మగుత్తి) సొగసుగా ఏర్పడెను. అనంతరము ఒకముక్కునకు తీసివేసి సాధారణముగ కుడిముక్కుకే ఏదోయొకటి యుంచుకొనుట కెటస్థించెను. కాని ఇరువదవశతాబ్దపు 'ఫేషను' ముక్కునకు ఏవస్తువు కూడ ఉండరాదని. మాతూర్పు గోదావరిలోనే యీ నాగరకత ప్రారంభమైనది. ఇంకను అడ్డబాస, నత్తు, ముక్కుపుడకలు మున్నగు పూర్వపు వస్తువులను ధరించువారు యున్నారు. వారు నవీననాగరకతా సిద్ధినిపొందక, పూర్వశతాబ్దములవారుగా గణింపబడుచున్నారు. ఒకరినిచూచి మరొకరు క్రమముగా ఒకటొకటే మానివేసి క్రొత్తపద్ధతుల ననుసరించుచున్నారు. ఆరవవారిలో నిమ్మగుత్తిని బేసరిని నిర్ధారణ చేసినట్లున్నది. అయితే వారిలో చాలమంది అసలు వజ్రపుపొడులను వేయించి విలువలో తయారు చేయించుకొందురు. తమిళులలో కొందరు వజ్రాలు వేసిన అడ్డబాసలను ధరించుచున్నారు. అంటే తమిళులు ముక్కునకు మూడుఆభరణములు నవనాగరకతగా యుంచుకొంటూంటే వారిలో సహజనివాదము గల తెలుగువారు అసలే అభరణములు లేకుండుట విచిత్రము. తామేమో మంచిఆభరణపు రాళ్ళు వేయకుండా ఇమిటేషన్ రాళ్ళను వేయుటచేత కొలది సంవత్సరములలో ఆభరణములో నీరుబట్టి నల్లబడి అసలుముఖముయొక్క అందముకూడ పోవుచున్నట్లు చూచుచున్నారము. అందుచేత నాసికమునకేదియు లేకపోవుటే పరిశుభ్రతయనిపించుచున్నది.

తలకుకొప్పులు పూర్వపుసొగసు, చిన్నవారు జడలు వేసుకొనెడివారట. కొప్పులుపోయి జడచుట్లు, కొండెశిఖలువచ్చెను. అవన్నియుపోయి యిప్పుడు జడను సిలకైను జంటమూమలతో బిగిగా చుట్టుకొనుచున్నారు. చిన్నపిల్లలు వాలుజడలను జల్లిజడలను వేసుకొనెదరు. ౧౮ సంవత్సరములు దాటిన వారందరు బిగిజడచుట్లనే యిప్పటిసొగసునిరి. తమిళులలో ముప్పది నలుబది సంవత్సరములవరకు వాలుజడయే ఫేషనుగాచేసిరి. అనంతరము తలగువ్వకొనివట్టిముడి వేసికొందురు. పూర్వకాలములో పాపిడి పింద్రీలు, తమలపాకు, మొగలిరేకు, రాగిడి, చంద్రవంక, పోకచక్క కొప్పుగొలుసులు, సూర్యుడు, చంద్రుడువంటి శిరోభూషణములుండెడివి. తర్వాత 'నాగరము' వచ్చెను. ఇప్పుడు నాగరమును చూచువారులేరు. బంగారుచామంతిపువ్వుమాత్రం యిప్పుడు ధరించెదరు. పుష్పములను హెచ్చుగా తలకి నిత్యము వాడుచున్నారు. అందుచేత శిరోభూషణముల యావశ్యకత చాల తగ్గిపోవుచున్నది.

పూర్వము చెవికట్టి యాభరణములను ధరించియుండినను నేడు చిన్నదుద్దులజతను వేసికొనుటయే నిర్ధారణగ అందరిలోను ఏర్పడినది. మధ్యను చెంపసరాలువచ్చెను. కాని అవి అదృశ్యమైనవి. తెల్లదుద్దులు లేక కమలాలజతయే కర్ణాభరణమని నేడు చెప్పవచ్చును. చెవికి బావిలీలు, కర్ణపుష్పాలు,

బొగడలు, జూకాలు పూర్వపు వేషాలట.

కంఠాభరణములలో ఎన్నిమార్పులు చెందినవో చెప్పజాలము. పూర్వం కంటె, పట్టెడ, వాను, మిరియాలపేరు, కాసులపేరు, పొగడాలకుత్తిగంటి మొదలైనవియుండెడివి. తర్వాత పుదుచ్చేరి వాను, జిగినీగొలుసులు, దొరుగళ్ళైనన్నైను. నేడు పొడుగాటిగొలుసు, చంద్రహారము, కట్టకాసులపేరు,కొందరు కంఠి నిర్ధారణ నగలగా ధరించుచున్నారు.

నడుముకివడ్డాణము పూర్వము యుండెడిది. ఇప్పడును కొన్నిమార్పులతో యుంటున్నది.

కాలికి పూర్వము, అందెలు, కడియాలు, పాంజేవులు, తుమ్మకాయగొలుసులు, పావడాలు, గొళ్ళెపుగొలుసులు యుండెడివి. ఇప్పటిఫ్యాషనుకు అవిఅన్నియుపోయి పట్టాలు నిర్ధారణగా ఏర్పడినవి. పట్టాలలో అనేకరకాలు. తిమికులు కాలికి ఏ నగయు పెట్టుకొనరు. ఆ పద్ధతిని అవలంబించుటకు ఆంధ్రయువతీమణులు పూనుకొన్నట్లు కనబడుచున్నది. వ్రేలిచుట్లు మాత్రము యుంచుకొని కాలికి పసుపు రాసుకొన్నచో చాలుననుచున్నారు. అయితే యీ ఆచారములు పూర్వాంధ్రపీములోనివని మనవి చేయుచున్నాడను. సొగసులు నగలు జిల్లాజిల్లాకు ప్రాంతప్రాంతమునకు భేదించుచుండును.

—గోలకొండపత్రిక.

—అంగీరసుడు.

* * *

## తారలతీరులు.

గోహార్ కళ్ళు—మాధురి రూపం—దేవికారాణి నొసట—ఉమాశశి కంఠస్వరం—వాసంతి చిరునవ్వు—నళినితుర్కాడ్ తియ్యదనము—శాంతిఆప్టే చాతుర్యం—సులోచన సాటిలేని సౌందర్యం—సబితాదేవి గ్రేస్—జమ్నా భావ—నాకు చాల యిష్టము అని ఒకాయనఅన్నాడు.

ఈ క్రింది నటీవర్గము ఒక్కొక్కదానికి అందులోనే వారు అంజవేశారు, చేసింది ప్రసిద్ధి నిజంగా వారిని పైకితెచ్చింది. వారివారినటనా కౌశల్యవిద్య, అభినయం.

గోహార్ : ఆమెకన్నుల సౌందర్యంచేత విఖ్యాతి నటియైనది. అంతాకన్నులలోనే సైగ. కన్నులే మాట్లాడినట్లుండును. ఆమెకు అందమంతా, నేర్పంతా ఆ నేత్రద్వయంలోనేవుంది. అవే ఆమెకు అందాల ఆలయం. మరి ఆ నేత్రాలజంటలో ఏమియిమిడివుందో !

మాధురి : ఆమె రూపమే ఆమెను పైకితెచ్చినది. చక్కని అందమైన అంగసౌష్టవము ముద్దులగురిపించే ఆఫీగర్ మాధురికితప్ప మరెవ్వరికీ లేదు. అందులకే కొందరు రూపవతి అంటారు.

దేవికారాణి : విశాలవంతమైన ఆమె నొసలే ప్రజలను పరవశంచేస్తుంది. ఆమె అందమంతా ఆమె నొసటలోనే కురుస్తూంది, కనబడుతుంది.

ఉమాశశి : ఈమెకంఠమాధుర్యంవల్ల విఖ్యాతి నటి అనిపించుకొంది, చక్కని కోకిల కంఠమేకాదు ఆ వాయిస్ అన్నిరసాల్ని కక్కుతుందికూడా.

వాసంతి : ఈ బాలిక చిరునవ్వుకు ప్రసిద్ధి. ఈమె నవ్వితేనే చాలు నవరత్నాలు రాలుతుతాయి, ఆ నవ్వు భావగర్భితంగా వుంటుంది.

నళినితుర్కాడ్ : ఈమె తియ్యదనానికి పెట్టింది పేరు. ముద్దుగా ముచ్చటగా వుంటుంది. మధురభావాల్తో, తియ్యని తీపులు తలంపులతో నటిస్తూంది.

శాంతిఆప్టే : విట్ అండ్ హ్యూమర్‌కు ప్రసిద్ధి. చాతుర్యానికి పైచెయ్యి. వికట వినోదాల్లో చాకచక్యాల్లో యీమెను మించినవారు లేరు. ప్రథమ తాంబూలం ఈమెకే అర్పించాలి. అందుకోవాలి. అందుకే ఆమెను చతురిక అంటారు కొందరు.

సులోచన : సాటిలేని అందానికి సుప్రసిద్ధి. ఈమె అందానికి పోటీ ఎవరూలేరు. అందం ప్రతి అవయవంలోను చిప్పిలుతుంది కాబోలు! ఈమెయొక సౌందర్యదేవత. అందాల రాణి.

సబితాదేవి : ఈమె కీవికి పుట్టిల్లు, కళ కళ

లాడుచూ దర్జాగ ఠీవిగ వుంటుంది. యీమె గ్రేస్ వర్ణనాతీతం. శృంగారదేవత కులుకునట్లుండును.

జమునా : ఈమె భాష చాలా బాగుంటుంది. పదములపొందిక స్పష్టంగా వుంటుంది. చక్కగ మాట్లాడుతుంది. అభినయిస్తుంది.

—సినీమా గెజట్.

* * *

## నేటి ఆంధ్రుల వేషము

భారతదేశమందు నివసించు వివిధప్రదేశముల లోని ప్రజలకు మతము, కులవిభాగములు, శాస్త్ర ప్రమాణములు, నమ్మకములు మొదలైన వొకటి యైనను, భాషావిభాగములుగలవు. దానినిబట్టియే వేషములుకూడ అన్యథా కనుపించును. అయ్యదియే రాష్ట్రజాతీయతకు మూలభిత్తి.

పంజాబు :—ఇట స్త్రీపురుషాదు లుభయులు లాగు చొక్కాల ధరింతురు. వారికి భేదము పురుషునకు తలపై 'పాగ,' స్త్రీలకు ఉత్తరీయం 'ముసుగు.' అయ్యది వారి మాతృవేషం. దానినిబట్టి వారిలో వారిని, పంజాబేతరులను, తేలికగా గ్రహించుట కనబడును. అన్యరాష్ట్రములవారి వేషములు వారు మచ్చునకైనను ధరింపరు. అది వారి జాతీయతాభివృద్ధి.

ఆర్యావర్తము :—ఇట ధోవతి రెండుగజముల పొడవుగనుండును. దానినచ్చటివారు శాలింతలవలె వదులుచుట్టుత్రిప్పి బిగించికట్టి, సన్నబిళ్ళగోచి పెట్టెదరు. 'లాల్చి,' శిరపాగ రంగులు తెలుపు గూడ చుట్టెదరు. స్త్రీలు లంగాలు, మేలిముసుగులు. ఇదివారి జాతీయత. దానిని వారు విడువరు.

బెంగాల్ :—5 గజముల ధోవతి వదులుబిళ్ళగోచి ముందుకుచ్చిళ్లు మామూలుగావుండి భూమిని తాకుచూవుంటవి. 'లాల్చి' కాలర్సుగలవు గాని యువిగూడ వారిమట్టుకే. స్త్రీలకు పదిమూరల చీరవంటి పొరకట్టు, మేలిముసుగు. దేశాలు తెగించిపోయినా ప్రాణంపోదికివచ్చినా మాతృవేషంమానరు.

ఇట్లే మరాటీ, మళయాళీ, గుజరాతీ, అరవ, మొదలైనవారికి గూడ ఒకనియామక వేషము స్త్రీ పురుషాదులకు కలదు. కాని నేటి యాంధ్రుల కిందులో యేమి......

ఆధునికకాలంలో యేవిషయంలో జూచినా ఆంధ్రులకు ఆంధ్రత్వం శూన్యం. వేషంజూద్దాం పోనీ. బంగాళీలాల్చి; బిళ్ళగోచి; తురకలుంగీ; షేర్వాణి; అరవవాని గుండాయికట్టు; సీమదొరల సూటు, బూటు, హేటు. యివియవి యననేల? అన్నివేషాలలో ఆంధ్రులకు స్థానంవుంది. జుట్టుకత్తిరింపులు, తలపాగలజాస్తే కట్లతెగి ప్రవహించు వరదవలె యిచ్చవచ్చినట్లు దారితీసినవి. ఆడవారిపరిస్థితి విలోకిస్తే...వారుమాత్రం తక్కువవారా? తమపురుషులను మించియున్నారుగాని, తీసిపోరు. అసలు ఔత్తరాహులకు, దాక్షిణాత్యులకు మేలిముసుగులోనే భేదమున్నది. కంచి కామాక్షి చీరలు, వారికట్టు, వారియాభరణములు, అరవవారి జాతీయత చెప్పుచున్నవి. తెనుగువారి ప్రత్యేకాభరణములు గూడ మున్నెప్పుడు వశించినవో! స్త్రీ పురుషుల జూచుటకు అసహ్యముగొల్పు కళాయిచేసిన ముఖములు, పొట్టిరవికెలు, ఒకవైపునకు జారవైచు పయ్యంటలు నేడు జుగుప్సకు మిగిలినవి. చీర లొకరకమా? కట్టు లొక విధమా? గోచీపోసికట్టు, లోగోచీకట్టు, కచ్చాపోసికట్టు యిత్యాదులు... యేప్రాంతమునకు పోయిన ఆంధ్రు డాప్రాంతము వారి వేషభాషలలో లీనమైపోయి తన జాతీయత వదలుకొనుచున్నాడు.

—కృష్ణాపత్రిక.

—నంబూరి సుబ్బరాజు.

# వైద్యగ్రంథములు

| | | |
|---|---|---|
| అష్టాంగహృదయము సూత్రస్థానము | 6 | 0 |
| ,, నిదానస్థానము | 2 | 0 |
| ,, చికిత్సాస్థానము | 4 | 8 |
| ,, కల్పస్థానము | 0 | 12 |
| ,, ఉత్తరస్థానము | 6 | 0 |
| వైద్యచింతామణి రెండు సంపుటములు | 8 | 0 |
| సుశ్రుతము, శారీరస్థానము ప్రాచీనము | 2 | 8 |
| ధన్వంతరినిఘంటువు (సవరణప్రతి) | 2 | 8 |
| వస్తుగుణపాఠము (గుణపాఠము) | 3 | 0 |
| సర్వౌషధగుణకల్పము | 2 | 8 |
| అనుపానమంజరి | 0 | 8 |
| అనుపానరత్నాకరము | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| అనుపానతరంగిణి | 0 | 12 |
| చికిత్సారత్నము. స్త్రీరోగ బాలరోగ చికిత్స | 1 | 4 |
| వైద్యకాలజ్ఞానము | 0 | 4 |
| వైద్యామృతము (అజీర్ణమంజరిచేరినది) | 1 | 4 |
| రసరత్నసముచ్చయము | 2 | 8 |
| బసవరాజీయము | 7 | 0 |
| శార్ఙ్గధరసంహిత | 3 | 0 |

పిడుగు వేంకటకృష్ణారావు పంతులు,

2/40, పెద్దినాయునివీధి, మదరాసు.



స్టార్ కంబైన్సువారి 'సారంగధర'లో రత్నాంగి భూమికను ధరించుచున్న శ్రీమతి శ్రీరంజని.

## నిజాము రాజ్యమునకు

వెంకట్రామా అండు కో ; 3993 మార్కెట్టుస్ట్రీట్. శికిందరాబాదు.

అనువారిని ఆంధ్రభూమికి ఛీఫ్ ఏజెంటులుగ నియమించినాము. బ్రిటిష్ పోష్టలు సౌకర్యములు లేక ఆంధ్రభూమికి చందాకట్టుటలో ఇబ్బందిపడుచున్న నిజామురాష్ట్రాంధ్రులు ఇకమీదట తమ తమ చందాధనమును వారికి పంపుచు ఆ విషయమును ప్రత్యేకముగ మా కార్యాలయమునకు కూడ తెలుపుచుండగలరు. శికిందరాబాదు, హైదరాబాదు వాస్తవ్యుల సౌకర్యార్థము వీరు మాసము మాసము ఆంధ్రభూమి విడిసంచికలు విక్రయింతురు.

# స్త్రీకి తల్లిఅవడంకంటె మించిన మహాభాగ్యంలేదు

రచయిత్రి:
శ్రీమతి బులుసు ప్రకాశమ్మ

ఆంధ్రభూమి దీపావళిసంచికలో శ్రీమతి వేదుల విశాలాక్షిగారు "తల్లినగుట నాకు ఇష్టములేదు" అనేపేరుతో ఆడుది తల్లిఅవడంలో ఉండేకష్టాలని వివరిస్తూ కొన్ని మాటలు వ్రాశారు. అవి చదివినపిమ్మట ఆడుది తల్లి అవడంలోఉండే లాభాలనిగూర్చి నాకుకూడా నాలుగుముక్కలు వ్రాయాలని అనిపించింది.

ఇంకా, ఈరోజులలో కొన్ని నవ్యులపత్రికలు, కొన్ని మందులప్రకటనలు స్త్రీలను నగ్నరూపంతో నడిబజారులో నిలవేస్తూనే ఉన్నాయి. ఆవిధంగా కథలు వ్యాసములు వ్రాయడం బాగుండలేదని చాలామంది అంటున్నారు కూడాను.

ఏదేనా ఒకవిషయం అదిఎంత అందరికీ సామాన్యమైనదే అయినప్పటికీ అదే అక్షరరూపంలో ఉంటే ఇతరులు ఎదుట చదవడానికీ, బొమ్మరూపంలో ఉంటే ఇతరుల ఎదుట చూడడానికీ స్త్రీలు సిగ్గుపడతారు. స్త్రీలకు సిగ్గే ఓపెద్దనగ. అలాంటప్పుడు స్త్రీలుకూడా పురుషులు చదువుతూఉంటే తలవంచుకొనే మాటలతో వ్యాసాలువ్రాయడం ఏమీ బాగుండలేదు.

ఒక్కొక్క ఆడుదానికి నల్గురేశిపిల్లలు చొప్పున ఉంటే చాలుననీ, ఇంకా ఎక్కువమంది ఉండడంవల్ల స్త్రీల ఆరోగ్యం చెడడమే కాకుండా కుటుంబాలలో దరిద్రము కూడా ఎక్కువవుతోంది అనిన్నీ ఈమధ్య కొందరు తలుస్తున్నారు.

ఈ వ్యాసములో స్త్రీ అసలే తల్లి అవకూడదు అనిన్నీ, అందమూ ఆరోగ్యమూ కాపాడుకొని చాలాకాలము జీవించడమే స్త్రీలకు మంచిది అనిన్నీ, పిల్లలను కనిపెంచడంలో ఆడుది ఎన్నో ఇబ్బందులుపడవలశివస్తోంది గనుక ఈవ్యాపారం స్త్రీలు మానాలనీ ఉంది.

బ్రతికిఉన్నన్నాళ్ళూ ఉండేటట్లుగా సౌందర్యాన్నీ ఆరోగ్యాన్నీ ఎంతమాత్రం చెడకుండా కాపాడుకోవడం తమవిధిఅనీ, పిల్లలు పుడితే ఆ సౌందర్యానికి ఏమైనా లోటువస్తే రావచ్చును గనుక పిల్లలు అసలే పుట్టకూడదు అని ఒక్క వేశ్యలేకోరుతారుగాని ఇంకే స్త్రీలూ కోరరు. అయినప్పటికీ వారికికూడా మాతృత్వముమీద కోరికఉందిగాని లేకపోలేదు. ఇందుచేతనే వేశ్యలు ఇతరులపిల్లలను డబ్బిచ్చి కొనుక్కొని పెంచుకుంటారు.

గర్భవతిగా ఉండడము శ్రైదు అని స్త్రీ ఎన్నడూ అనుకోదు. కలగబోయే బిడ్డను గురించిన తీయనితలంపులతోనూ, ఇంటిలోని వారు చూపించే ప్రేమ ఆదరణ గౌరవాలతోనూ ఆమెకు ఆరోజులు స్వర్గతుల్యంగా ఉంటాయి. గర్భవతిగా ఉన్న స్త్రీ పదునాలుగు భువనములను తనయందు ధరించిన ఆవిశ్వంభరునివలె దర్శనీయంగా ఉంటుందని ఒకకవి చెప్పాడు. తమవంశాభివృద్ధికి కారణమైన ఆస్త్రీ అత్తమామలకి భర్తకి ఎంతో నేత్రపర్వంగా ఉంటుంది. ఇతరులదృష్టికి బాగాలేనేమో అని ఆమె అనుకొనే అను

కోదు. పోనీ ఖైదే అనుకున్నా ఒకప్పుడు కొందరు తల్లులు ఈఖైదు అనుభవించబట్టే ఈనాడు గాంధి నెహురూలాంటి నాయకులు మనకు లభించారు. కనుక ఈ ఖైదుకూడా స్త్రీలకు మంచిదే.

తినకూడనివి ఒకటిరెండు ఉన్నప్పటికీ కూడినవెన్నో వస్తువులు డబ్బులేనివాళ్ళు అప్పుచేశిఅయినా గర్భవతికి చేశిపెడతారు. ఇంటికివచ్చే చుట్టాలు చక్కగా రకరకాల పొట్లాలు తెచ్చియిస్తారు. కొత్తచీరలతో ముద్దినుసురవికలగుడ్డలతో పెట్టి నింపుకోవాలంటే కడుపుతో ఉండడంకంటె మించిన వ్యాపారం ఇంకోటిలేదు. అదివరకు కోడంట్రికముపెట్టే అత్తకూడా తన మినపరొట్టిలోది కాస్తముక్క కసురుతూనేనా కోడలికి పెడుతుంది. తల్లిమాటవిని తన్నే మొగుడు కూడా చాటుగా ఏదేనా తెచ్చిఇస్తాడు. ఏ పని చేయబోయినా నీవు వోపలేనిదానివి కూచో మేముచేసుకుంటాము అంటారు. నాలుగురోజులకే తలంటి నీళ్ళు-తెల్లనివి తేలికైనవి చీరలు-పూలజడలు ఏవిధాన్నిచూసినా సుఖపడాలంటే స్త్రీలకు కడుపుతో ఉండడం లాంటి లాభకరమైన వ్యాపారం మరోటి లేదు.

వడ్డాణాలు ఈరోజులలో వట్టివాళ్లే పెట్టుకోడం మానేశారు. వేవిళ్లు అందరికీఉండవు. ఉన్నా సాధారణంగా నాలుగునెలలే ఉంటాయి. ఆపరేషనులు అందరికీరావు. ఈరోజులలో పిల్లలులేనివాళ్ళకే చాలామందికి ఆపరేషనులు వస్తున్నాయి. అదికర్మ. పిల్లలులేకపోతే వంట్లో కొవ్వుపెరిగి అతిగా లావెక్కిపోతారు. పదిహేనుఏళ్ళకే పిల్లలు ఇంకా పుట్టకమునుపే చాలామంది ఆడపిల్లలు అవ్వాలైపోతున్నారు. అది వంటితీరు.

బాలింతతనమంత సుఖం మరోటిలేదు. మునుపు పురుడు పదిరోజులూ ఏదో పథ్యం అంటూ అనేవారు. అదేనా పొట్లకాయకూరా, ఉల్లిపాయలకారం, తెలకపిండికూరా కందవడియాలూ, కమ్మటి ఆవునెయ్యి ఇంకా ఎన్నో అన్నిపెట్టేవారు. ఇప్పుడు ఆస్పత్రి మందుల ధర్మమా అని అడిగితే లడువుగా నాన్‌రొట్టే కాఫీ ఆహా పురుడంటే చాలా లాభకరమైన వ్యాపారం.

అదివరకుదాకా ఇబ్బందివస్తే పడుకునేందుకు చాపగుడ్డఅయినా ఇవ్వని అత్తగారు "పిల్లతల్లివి కిందపడుకుంటే పిల్లవాడికి జలుబుచేస్తుంది" అంటూ మంచం తానే తెచ్చివేస్తుంది. "చెరువుకుపోయి నీళ్లోసుకురా" అనే మనిషల్లా మారిపోయి చీకటితో లేచి నీళ్ళుకాచి పోస్తుంది. పిల్లవాడికి పాలుండవేమో అని వేడివేడి ఆవుపాలు తాగడానికి ఇస్తుంది. పిల్లవాడికి కడుపునొప్పి వస్తుందేమో అని పొడిఅన్నంపెట్టుకోమనదు. ఇంట్లో పనిఎక్కువై చేయలేనప్పుడు పిల్లవాడు ఏడుస్తున్నాడంటూ ఓచోట వాడిని ముందరవేసుకుని కూచోవచ్చును. అదివరకుదాకా చీటికిమాటికి కొట్టే మగవాడుకూడా చంకలో పిల్లవాడు భయపడి ఏడుస్తాడేమో అని కొట్టడం మానివేస్తాడు. భార్యవల్లో ఉండి పాలుతాగకుండా ఏడుస్తున్న పిల్లవాడిని చూచేసరికి భర్త స్వయంగా విసనకర్రపుచ్చుకుని పిల్లవాడికే విసురుతున్నాననుకుంటూ భార్యకు చక్కగా విసురుతాడు. పాతకోపాలేవేనాఉంటే ఈవిధంగా స్త్రీలు తీర్చుకోవచ్చును. ఏలాచూచినా పిల్లలను కనడం చాలా మంచివ్యాపారం.

తాపులగొడ్డుకు రోలుఅడ్డం అన్నట్టుగా ఎంతదుర్మార్గుడైన మగవాడుకూడా పిల్లలు

బయలుదేరేసరికి కమ్మెచ్చునిదీశిన బంగారంలాగ సరిఅయిన పద్ధతిలోకి వస్తాడు. నూడిదలు తింటూకూచుని వళ్లు బలవపెట్టుకోకుండా కడుపుతో ఉన్నరోజులలో గర్భిణీహితచర్య మున్నగు పుస్తకములలో చెప్పినట్లు పనిపాటాచేస్తూ తేలికైన ఆహారం తింటూఉంటే పురుడుకూడా తేలికగా వస్తుంది. అనాగరికస్త్రీలు బాగా పాటుపడతారు. కనుకనే రెండవకంటికి తెలియకుండా వారిపురుళ్లు వెళ్ళిపోతాయి.

బిడ్డల తొక్కుపలుకులు వింటూఉంటే ఎటువంటి సాంసారికములైన బాధలూ మటుమాయమైపోతాయి. సుతుల సంభాషణములు చెవులకు భూషణములవంటివని మహాభక్తుడైన పోతనవంటివాడే అన్నాడు. గృహిణీ ధర్మము నిర్వహించే ప్రతిస్త్రీకి గర్భధారణ ఆనందమునిచ్చే వ్యాపారం.

కాలధర్మము ననుసరించి చెట్లు పూలు పూస్తాయి. తరువాత ఆపూలలో కలిగే మార్పులవల్ల కాయలు పళ్లూ వృద్ధిచెందుతాయి. ఆ పళ్లుతిని ఎంతోమంది ఆనందించుతారు. కాయలుకాయని పువ్వులు రాలిపోతాయిగాని చెట్టుని అట్టేఉండవు. పిల్లలు కలగకపోయినా యావనము, సౌందర్యము నిలవవు. కాయకుండా రాలిపోవడంకంటె కాశి రాలిపోడం మంచిదికదూ?

దూడ పాలుకుడుస్తూంటే దానిని నాకుతూ ఆవుపొందే ఆనందము గానుగులాగే ఎద్దుకు ఎక్కడిది? తన ఆరుపిల్లలూ పక్కలోను మీద పడి పాలుతాగుతూఉంటే వళ్లుమరిచి పడుకుని ఆడకుక్కపొందేసుఖము వీధులుతిరిగి కర్రదెబ్బలుతినే మగకుక్కకేలా వస్తుంది? నిండుగెలలతోఉన్న తాడిచెట్టుని పిల్లలు కూడా "అదిగో ముంజికాయలు" అంటూ ప్రేమగా చూస్తారు. గొడ్డుతాడి ఎన్నటికైనా గొడ్డలిపాలే.

దీపావళి, విఘ్నేశ్వరుడి చవితి మొదలైన పండుగల రోజులలో బిడ్డలుగల దంపతులు పొందే ఆనందం ఎందరోకవుల కలాలకు పని కల్పించుతోంది.

శూన్యగృహాలనుండి వినపడేవి విషాదగీతాలే. స్త్రీఅయిన ప్రతిప్రాణికీ తల్లిఅవాలని కోరిక ఉంటుందని మనోశాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇందుకు నిదర్శనంగా కొందరు పిల్లలు లేనిస్త్రీలు కుక్కలనూ, పిల్లులనూ, గేదెదూడలనూ పెంచుతూ తమ మాతృత్వవాంఛ తీర్చుకోడం అందరూ ఎరుగున్నవిషయమే.

భగవంతుని సృష్టిలో పునరుత్పత్తికీ, నాశనశక్తికీ అనగా మృత్యువుకీ ప్రతిక్షణమూ గొప్ప పోట్లాట జరుగుతూఉండడమూ చివరికి పునరుత్పత్తి శక్తికే జయముకలుగుతూ ఉండడమూ మనము చూస్తున్నాము. ఇందుకు నిదర్శనముగా, ప్రజలు వేలకువేలు ఖర్చుపెట్టి పెద్దపెద్ద మేడలు కడుతున్నారు. ఎంతజాగ్రత్తగా వాటిని ఉంచినాసరే కొంతకాలానికి ఆమేడలు ప్రకృతిధర్మమునుబట్టి శిథిలములు అవుతున్నాయేగాని స్థిరముగా ఉండుటలేదు. అయినప్పటికీ ఎక్కడో ఒకచోట తిరిగి నాలుగుమేడలు కట్టబడుతూనే ఉన్నాయి. ఒకచెట్టు చచ్చిపోతే ఆచోటులో నాలుగుచెట్లు మొలుస్తున్నాయి. మృత్యువుని పునరుత్పత్తిశక్తే జయిస్తోంది.

ప్రతిసంవత్సరమూ గాలివానలతోటి, భూకంపాలతోటి ఎందరో ప్రజలు నాశనము అవుతున్నారు. అయినప్పటికీ జనాభా ఆశ్చర్యముగా పెరిగిపోతోంది. పునరుత్పత్తి, ప్రకృతి లక్షణము. దానిని అపుటకు ప్రయత్నించుట మానవుని వెఱ్ఱి.

# స్వేచ్ఛావసానము

రచయిత:

రెండుచింతల నరసింహశాస్త్రి

స్వేచ్ఛయటంచు నే దభిలషించితినో అదె పంప, గ్రుడ్డి, న
స్వచ్ఛపథాల వెంటబడి సాగినయంతకునేగి వక్రపున్
తుచ్ఛుల మాయలన్ బడి యధోగతి కీడ్వగనై మనో వినా
త్నచ్ఛవి గోలుపోయిన వృథామతి బంధితుడైతి నేటికిన్.

నాయాశల్ విఫలమ్ములై మురియుటల్ నన్నించి నల్వంకలన్
పోవెన్ ; చెప్పగలేను నే డెడియు సంబోధించి శాంతింపనా
నో యీవైశాల్యములో ; రసార్ద్రిమధురం బాహా ప్రపంచంబు ; బా
ధాయాసం బెగబోసికొం చెటకు నీడన్ గల్గుదున్ వార్ధిలోన్.

సడలిన జీవితాశయవిచారి నలౌకిక సత్ప్రివృత్తిచే
చెడిన మహాంధుడన్ చలితశీలుడ గిట్టనివారిలోపలన్
అడుగిడి తీసికోదలచినంత తదాగ్రహ రేలిపోకి బె
గ్గడిలి తలంకి నిష్ఠురవికంపితశాంతుడనైతి దీనతన్.

సహానమె శీలలక్షణము సంస్కరణేష్టుల ముఖ్యలక్ష్య మం
చు, హృదయవీణనే యపరిశుద్ధుని కష్టపు కర్కశాంగుళీ
నిహతికి నోర్వజేసి యవనీధరమూనిన శేషునట్లధః
కుహరమునందు త్రోయబడి కుళ్ళి కృశించి నశింపనుంటిగా.

ననునే నొవ్వగ నాడుకో నితరుల్ నాపేర్మి తామోర్వ లే
కనృతప్రాయములే విమర్శనలు సేయన్ రెంట పేర్చెడ్డ వా
డనుకాగా సరసుండెవండొ గురుజాడన్ నన్ సమీపించి తా
నును నాతో పడివచ్చు నిర్జననికాంతో గ్రాటవీసీమకున్.

నాకంటన్ బడి నాకరగ్రసితుడై నా కింపుగూర్పంగ నా
రాకాచంద్రునికైన సాధ్యమె దరిద్రజ్యోతి నా కండ్లలో
శోకారిష్టవికారముల్ గొలుపగా శుష్కక్రియాశీలినై
రేకుల్ రాలిన పద్మమట్లెటుల నిర్జీవిన్ భవంబీడ్చెదన్.

# మన ఫలవృక్షములు—వాని ఉపయోగములు

## 1. అంజూరు.

### Ficus Carica.

మన్నుమసాలుగల చెక్కనేల కావాలి. నీరు నిలవ ఉండకూడదు. ఒకఏడాది వయస్సుకు పైపడిన చెట్లనుండి కొమ్మలు తెచ్చి పాతి ప్రవర్థనముచేయవచ్చు. పాతిన రెండవఏటకాని మూడవయేటకాని ఫలింప నారంభించును. పంద్రెండు, పదిహేను ఏళ్ళవరకు పండ్లనిచ్చును. ఏడాదికి రెండుకాపులు. రవానాచేయవలసిన పళ్ళను కోసి మంచిఎండలో ఒకవారమురోజులు ఎండబెట్టవలెను. చెట్టు 7 లేక 8 అడుగులఎత్తు ఎదుగును. జూన్‌లో ఒకసారి, జనవరిలో ఒకసారి కాయును. జనవరికాపు ముఖ్యమైనది. పూనాప్రాంతములందు ఈతోటలు విస్తారము. పాకములో వేసి నిలవచేయవచ్చును. ఎండినపళ్లు మృదుత్వమును కలుగజేయును; మార్దవకరమైనవి. అంజూరు పుష్టిదము, మృదువిరేచనకారి. మలబద్ధరోగులకు చక్కని ఆహారము. ప్రారంభదశలోనున్న శ్వేతకుష్ఠమునకు దీని ఆకులరసము పట్టించిన గుణకారిగనుండును.

## 2. అనాస.

### Annas Sativa.

అమెరికాఖండము దీనిజన్మస్థానము.ఆఖండము కనుగొనబడిన తరువాత ఇది ప్రపంచములోని ఇతర భాగములకు కొనిరాబడెను. మంచిఫలమగుటచే అచిరకాలముననే విశ్వవ్యాప్తినందెను. కొండప్రదేశములందలి ఇసుకగరువులలో జలసమృద్ధి ఉన్నచో అనాస బాగుగ ఎదుగును. నేల మిక్కిలి సారవంతమై ఉండవలెను. ఇతరచెట్లనీడలందు పెంచిన అనాసచెట్లు పెద్దకాయలనుకాయును. కాని ఆకాయలు రుచిహీనములుగా ఉండును. వేసిన తావున ఈమొక్కను మూడునాలుగేళ్ళకంటె ఎక్కువకాలము ఉంచకూడదు. జూలైనుంచి అక్టోబరు ఆఖరువరకు అనాసపళ్లు దొరుకును. అనాసఆకులనుండి మంచినార వచ్చును. ఫిలిప్పైన్ దీవులలో అనాసనారనుండి విలువైన బట్టలు నేయుదురు. అనాసనార తాడు చెప్పులుకుట్టు తాడుగా ఉపయోగించును. పచ్చికాయ తినిన గర్భపాతముగలుగును. పచ్చకామాల రోగములో అనాసపండురసము మిక్కిలి గుణకారిగానుండును. బలకరమైన ఆహారము; రసాయనము. అనాసఆకులరసములో పంచదారకలిపి ఇచ్చినచో ఎక్కిళ్లు మానును.

## 3. అరటి.

### Musa Sapientum.

దీనిప్రవర్ధనము అందరకు తెలిసినదే. మామిడిపళ్ల తరువాత అరటిపళ్ళే విశేషముగా ప్రజలచే ఆదరింపబడునవి. పళ్ళే కాక అరటివలన ఇతర ఉపయోగములనేకలవు. అరటిపువ్వు, అరటిదూట (దవ్వ) కూరకు పచ్చడికి ఉపయోగింతురు. అరటినార ఉపయోగకరమైనది. అరటిడిప్పలనుండి కాగితముగుజ్జు చేయవచ్చునని కనుగొనబడినది. అరటిపండు చలవచేయును. అరటిదుంప సుఖరోగములందు ఔషధముగా వాడబడును. లేతఆకులు కాలినపుండ్లమీద వేసి కట్టుటకు ఎంతయు అనుకూలముగ ఉండును.

## 4. ఈడ.

### Paradise Apple.

నారింజజాతిచెట్లలో ఇది మిక్కిలి చిన్నకాయలు కాయును. ఇది సంవత్సరమున అన్నికాలములందును పూయుచు, కాయుచు ఉండును. ఎల్లకాలము పూవులతో, లేతకాయలతో, దోరకాయలతో, పండ్లతో చెట్లు దర్శనీయములై యుండును. ఈచెట్టు ఆకులు మిక్కిలి చిన్నవిగానుండును. విత్తువలన ప్రవర్ధనము. నాటిన ఏడు లేక ఎనిమిదేండ్లకు కాయును.

## 5. ఈత.

### Phœnix Sylvestris.

కల్లుతీయుదురు. దానినుండి చెక్కెర తయారు

చేయుదురు. ఆకులతో చాపలు చేయుదురు. 30 మొదలు 40 అడుగులఎత్తువరకు ఎదుగును. ఎండకాలము ప్రారంభమున పూచి కాయును. బెంగాలులో ఈత సారమునుండి చెక్కరచేయుట విస్తారము. అచట దాదాపు 2 లక్షల ఎకరములు ఈతచెట్లసాగులో నున్నవి. చెక్కరచేయుగా వచ్చిన బెల్లపు తెట్టు పొగాకుతో కలిపి హుక్కా పట్టుటకు ఉపయోగింతురు. ఏడేళ్లుదాటిన చెట్టునుండి కల్లుతీయవచ్చును. అప్పటినుంచి ఇరవై ఇరవైఅయిదేళ్ళవరకు కల్లు ఇచ్చుచుండును. ఈతబెత్తములతో బుట్టలు చేయుదురు. వీనిగింజలు పందులు తినును.

### 6. ఉసిరిక.

### Phyllanthus Emblica.

ఇండియా, బర్మాదేశములందు అడవులలోను, తోటలలోను విరివిగ పెరుగుచెట్టు. దీనిబంకకు ఎట్టి వుపయోగముకాని కనుగొనబడలేదు. పండు ఔషధములలో, బట్టలకు రంగువేయుటలో, తోళ్లు పదునుచేయుటలో వాడుదురు. దీనిరంగు మామూలు బట్టలకు కంటె పట్టుబట్టలకు బాగుగపట్టును. పట్టలోను, ఆకులలోను కూడ ఇట్టిరంగుకలదు. ఆయుర్వేదవైద్యులు విరివిగ నుపయోగించు త్రిఫలములలో ఇది ఒకటి. యునానివైద్యులుకూడ దీని ఓషధీగుణమును బహుళముగా వర్ణింతురు. వుసిరికాయలు పచ్చళ్ళ కుపయోగింతురు. దీనికలప నీటిలో చీకదు. పైగా దీనికి జలమును శుద్ధిచేయుగుణము కలదు. కావున వుసిరిక కలపను నూతికట్టులకు అడుగున వేయుదురు. వుసిరిక కర్రముక్కలు, చిన్నకొమ్మలు నీటిలో పడవైచిన నీటిని శుద్ధిచేయును. వుసిరిక వలువుతో తల అంటుకొనిన ప్రశస్తముగానుండును. సిరాచేయుటకు, తలకు రంగువేయుటకు వుపయోగించును. కార్తికమహాత్మ్యము వుసిరికచెట్టును పవిత్ర వృక్షముగా వర్ణింపుచున్నది. కార్తికమాసమున ఈ చెట్టునీడను భుజించుట సకలపాపహరముగా నుండునని చెప్పబడుచున్నది. వుసిరికఆకులు పశువులకు మంచి ఆహారము. వుసిరికపండ్లను కొన్ని పశువులు అతిప్రీతిగ తినును.

### 7. కమలాఫలము.

### Kamala Orange.

నారింజజాతి చెట్లలో పైతోలు మిక్కిలి సుల్లగానుండు ఫలములను కాయుజాతి ఇదే. గోదావరి అరణ్యములందు ఈచెట్లు స్వతస్సిద్ధముగా పెరిగి ఫలించుచున్నవి. తోటలందు వీనిని ప్రత్యేకముగా పెంచుట అరుదు. దీని ఆకులు మిక్కిలి చిన్నవిగా నుండును.

### 8. కరుబూజా.

### Cucumis Melo.

ఇందులో నూటికి 90 పాళ్లు నీళ్లే. కాబట్టి ఇందులో బలకరపదార్థము మిక్కిలి తక్కువ. కాని లోని గుజ్జు పదార్థములో అల్బుమినాయిడ్సు విస్తరించియున్నవి. దీనివిత్తులలో నూటికి .30 పాళ్లు నూని కలదు. కరుబూజాపండు పుష్టి, శుక్రవృద్ధిచేయును. దాహనాశనకరము. శ్రమను పోగొట్టును. మూత్రకారి. పిత్తహరము. ఉన్మాదహరము. గింజలలో హైపోజాంతైన్ అను పదార్థముకలదు. కరుబూజాపళ్ల తొడిమలను చీనాదేశస్థులు ఓషధిగా వాడుదురు. అజీర్ణరోగులకు మంచిది. ఇండో చీనాలో వాంతి నిరోధమునకు దీనిని వాడుదురు.

### 9. కొబ్బెర.

### Cocos Nucifera.

కొబ్బరినూనె బట్టతలకు మంచిమందు. జ్వరము మున్నగు వ్యాధులవలని నీరసముచే తలవెంట్రుకలు రాలిపోవునపుడు దీనినుపయోగించినచో దీనిగుణము సుస్పష్టమగును. కొబ్బరి మంచి ఆహారము. కొబ్బెర నూని విస్తారము తినినచో అజీర్ణముచేయును. హిందూదేశమున ప్రస్తుతము 5 లక్షల యెకరములలో కొబ్బరి సాగుచేయబడుచున్నట్లు తెలియుచున్నది. ఒక్కొక్కచెట్టు ఏడాదికి 50 మొదలు 200 కాయలవరకు ఇచ్చును. 70 లేక 80 ఏళ్ళపర్యంతము ఫలించుచునేవుండును. సముద్రతీరప్రదేశములందు ఇది బాగుగ ఎదుగును. కొబ్బరి డొక్కలనుండి నార తయారుచేసి తాళ్లు, మోకులు పేనుదురు. కొబ్బరి

పీచుతో మెత్తలు, పరుపులు తయారుచేయుదురు. పరజాలుకూడ నేయుదురు. ఆకులు చాపలకు, పళ్ళకు, ఇళ్ళకు, బుట్టలకు వాడబడును. కొబ్బరినూనె కొవ్వువత్తులు, సబ్బులు తయారుచేయుటలో ఉపయోగించును. లేత కొబ్బరికాయలోని నీళ్లు మూత్రకోశవ్యాధులందు చాల ఉపయోగమైనవి. రక్తశుద్ధి చేయును. కాని విస్తరించి త్రాగిన అండవృద్ధి కలిగించునని వంగదేశీయుల నమ్మకము. కొబ్బరి, కొబ్బరిపెంకు ఇతర ఉపయోగములకు తోడు ఔషధముగాకూడ వాడబడుచున్నవి. కొబ్బరినుండి కల్లుతీయుదురు. దానితో పంచదార చేయుదురు. కొబ్బరిబెల్లమును సున్నముతో కలిపిన మంచి సిమెంటు తయారగును. ఆముదము తీయుటకు ఆముదపుగింజలను వుడకబెట్టు నీటిలో కొబ్బరినీళ్లుకూడ కలుపుదురు. కలప ఉపయోగకరమైనది. కొబ్బరి వుపయోగములు అనంతమైనవి.

## 10. ఖర్జూరము.

## Phœnix dactylifera.

120 అడుగుల ఎత్తువరకు ఎదుగును. పూచి ఫలించేలోపుగ (అనగా ఏడాదికి ఐదు నెలలకాలము) వర్షములు కురియు ప్రదేశములందు ఇది బాగుగ కాయదు. అరేబియాదేశస్థులకు ఇది ప్రధానమైన ఆహారము. దోరస్థితిలోను, బాగుగా పండినప్పుడును దీనిని తినవచ్చును. పళ్ళరసము ఇతర ఆహారపదార్థములకు మాధుర్యము కలిగించుటకు వాడుదురు. పళ్ళనుండి సారాయముతయారుచేయవచ్చును. కల్లుగీయవచ్చును. ఆకులు చాపలుగా, తెరలుగా, తాళ్లుగా తయారుచేయబడుచున్నవి. కాండములు అనేకమగు పనులకు వినియోగమగుచున్నవి. ఆకులలోను, పళ్ళలోను ఒకవిధమగు సువాసనగర్భితమైయున్నది.

## 11. చింత.

## Tamarindus Indica.

80 అడుగుల ఎత్తువరకు ఎదుగును. కాండము చుట్టుకొలత 25 అడుగులవరకు వుండుటగలదు. రంగులు వేయుటలో దీని ఆకులు, పువ్వులు, పండు వాడబడుచున్నవి. చింతపండు జీర్ణశక్తినిచ్చును. పిత్తశమనము. విరేచనకారి. చింతగుల్లలు మందుకు వాడబడుచున్నవి. చింతపువ్వుల రసము మూలశంకరోగమును పోకార్చును. చింతచెట్టునీడ మంచిదికాదు. దీనినీడను ఏచెట్టును పెరగదు. కాని నేలవేము అను మూలికమాత్రము బాగుగ ఎదుగును. చింతగింజలు గ్రహణినికట్టును. చింతపండేగాక చింతగింజలు, చిగురు, పువ్వులు ఆహారపదార్థములుగ వాడుదురు. చింత విశేషమైన వుపయోగముగలది. అడవులలో వృక్షములన్నిటికంటె దీనివలని రాబడి హెచ్చు. ఒక్కొక్కచెట్టు 350 పౌనుల చింతపండును ఇచ్చుటగలదు. చింతకలప చిరకాలము నిలుచును. బండిచక్రములు, పచ్చడి బండలు, కొయ్యగూటములు, కొయ్యసుమ్మెటలు, చిత్రికలు, ఇతరపనిముట్లు రోళ్లు, నూనిగానుగలు, చెరుకుగానుగలు చేయుటకు చింత కలప వుపయోగింతురు. చింతకర్రలేనిదే ఇటికె ఆవకాల్పు సరిగ వుండదు. తుపాకిమందుచేయు బొగ్గులలో చింతబొగ్గుకు విలువకలదు. పాత్రల చిలుమును పోగొట్టుటకు చింతపండు ప్రశస్తమైనది.

## 12. జామ.

## Psidium Guyava.

అమెరికాఖండమునుండి మనదేశమునకు కొనిరాబడిన ఫలవృక్షములలో నిదియొకటి. అనుకూల ప్రదేశములలో విస్తరించి పెరుగును. పక్షులవలన గింజలు చెదరగొట్టబడి ప్రవర్ధనము సాగును. విత్తులు విస్తారముగుటచే వ్యాపనమునకు అవకాశములు హెచ్చు. రెండవసంవత్సరమునుండి కాపుపట్టుటగలదు. నాలుగవఏటనుండి తప్పక కాయును. జామచెట్టు 30 మొదలు 40 ఏండ్లవరకు బ్రతుకును. పట్టుబట్టలకు నల్లరంగువేయుటలో దీనిఆకులను పీకస్ కలంకారీలు ఉపయోగింతురు. ఆకులు ఓషధీగుణముకలవి. గ్రహణికి మంచివి. కడుపునొప్పిని కుదుర్చును. జామపట్ట, ఆకులు ప్రసూతల మైలను బయటికి తొలగించుటకు మలయాలో వాడబడుచున్నవి. చర్మవ్యాధులకును, డచ్చి ఇండీస్‌లో లుకోరియాకును ఆకుల కషాయము వాడబడుచున్నది. దీని ఆకుల చూర్ణము బాంగాకాలో తేయాకుకు బదులుగా వుపయో

గింతురు. కలపతో బల్లెములపిళ్లు, ఇతరపనిముట్లు చేయుదురు. కంచెలకు - బొగ్గులకు పుపయోగము. జామచెట్టుపట్ట దాల్చినచెక్కకు బదులుగా దాల్చిన చమురులో ముంచి అమ్మబడుచున్నది.

### 13. జీడి మామిడి.

### Anacardium Occidentale.

దీనినే ముంతమామిడి అనికూడ అందురు. దక్షిణ అమెరికానుండి కొనిరాబడిన వృక్షము. ఇప్పుడు హిందూదేశమున సర్వత్ర పెరుగుచున్నది. దీనికి సముద్రతీరమందలి ఇసుకనేలలు ప్రశస్తములు. ఈ చెట్టునుండి ఒకవిధమైన జిగురు స్రవించును. పురుగులకు ఈజిగురువాసన కిట్టదు. చేపలవలలకు రంగు వేయుటకు దీనిపట్టనుండి తీసినరసము వాడుదురు. జీడిమామిడిగింజల పెంకునుండి జాగ్రత్తగ తయారు చేసిన చమురు ప్రశస్తమైన బాదమునూనెతో సమమైయుండును. ఈచమురువ్రాసిన కర్రవద్దకు చెదపురుగులు చేరవు. దీనికి ఔషధోపయోగముకూడగలదు. జీడిపప్పు తినుబండారములలో వాడుచున్నాము. కలప ప్యాకింగు చెక్కలకు పనికివచ్చును. పొయ్యిలో పెడితే పొగ ఎక్కువ. జీడి ఆకులతో విస్తళ్లు కుట్టుదురు.

### 14. తాటి.

### Borassus flabelliformis.

ఇది వ్యవసాయదారుని కల్పవృక్షము. ఆకులతో బుట్టలు, చాపలు, విసనకర్రలు, గొడుగులు మున్నగునవి చేయుదురు. నారతో తాళ్లు చేయుదురు. తాటిఆకులు దడులకు, ఇళ్ళకు, పాకలకు ఉపయోగించును. కాగితము రాకపూర్వము ఇవియే వ్రాతసాధనములు. తాటి దూలములు ఇంటికలపగా, చిన్న కాలవలమీద దాటుడువంతెనలుగా, తాటిమాను దొలిచి ఏతాముగా వినియోగింతురు. తాటికల్లునుండి చెక్కెరచేయుదురు. తాటిటేగలు మంచి ఆహారము. తాటిపళ్లు ఆగష్టునెలలో అనగా వర్షాకాలమున లభ్యమగును. బుర్రగుంజు మధురముగా నుండును. తాటిముంజెలు చలువ, మేహశాంతి. వంగదేశస్థులు ముంజెలను ముక్కలుగా తరిగి పంచదార కలిపి పన్నీరుచల్లి తిందురు. తాటిపండు పేశములో రొట్టెలు కాల్చుదురు.

### 15. దబ్బ.

### Citrus Limonum.

దబ్బపండు తొక్కనుండి సిసిలీలోను, ఫ్రాన్సులోను ఒకవిధమగు నూనె తయారుచేయుదురు. అది అత్తరువులందు, ఉడుకులోను చేయుటయందు వాడుదురు. జంతువిషములకు దబ్బపండు రసము విరుగుడు. జ్వరములతో కూడిన అజీర్ణరోగులకు సాయంత్రము దబ్బరస మీయబడుచున్నది. వెస్టుఇండీసులో వేరుపట్ట జ్వరహరమైన ఔషధముగాను, గింజలను కడుపులోని పురుగులను పోకార్చుటకును వాడుదురు. దబ్బపండు ఊరగాయకు, పులిహోర మొదలగు వంటకములు చేయుటకు వాడుదురు.

### 16. దానిమ్మ.

### Punica Granatum.

చిన్నచెట్టు. దీని జన్మదేశము పారశీకము. పండుగానేకాక ఓషధిగాకూడ చిరకాలముగ అంగీకరింపబడియున్నది. మీకడుపులు కందపెరడులవలె ఫలించుగాక అని మనదేశపు స్త్రీలను పెద్దలు ఆశీర్వదించునట్లే కొన్ని దేశములందు అచటిపెద్దలు అచటి స్త్రీలను మీకడుపులు దానిమ్మచెట్లవలె ఫలించుగాక అని ఆశీర్వదింతురు. సాధారణముగ ఎర్రపువ్వులు పూయును. జావాలో తెల్లపూవులరకముకూగలదు. పైనదళసరి చర్మముండుటచే రవాణాకు తాళును. పులుపు, తీపు రెండురకములు. వేరుపట్ట క్రిమిహారమైనది. కడుపునొప్పితో బాధపడు పిల్లలకు మలయాదేశములో వేరుచూర్ణమునిత్తురు. వేరు గ్రహణీరోగమునకు, ఋతువు క్రమముగ జారీకానందు రోగమునకు వాడుదురు. పండుతొక్క గ్రహణికి మంచిది. వేరురసము నేత్రరోగములలో కండ్లయందు పోయుదురు. రాలిన దానిమ్మపూవులు పుదాత్తభోజనమువలని అజీర్ణమును పోకార్చును. పండ్లరసము దగ్గుకుమంచిది. దానిమ్మ ఆకులనుండి జావాలో ఒక విధ

ముగ సిరాచేయుదురు. కఱ్ఱగట్టిది. చిన్నచిన్న వస్తువులు చేయుటకు వాడవచ్చును. దానిమ్మ అరుచిని పోగొట్టి అగ్నిదీప్తి నిచ్చును.

## 17. ద్రాక్ష.

### Vitis Vinefera.

సమశీతోష్ణప్రదేశములందు బాగుగ పెరుగును. చరక సుశ్రుతాచార్యులకాలమునుండియు ద్రాక్ష భారతీయులకు లెస్సగ పరిచితమైయున్నది. మన ప్రాంతములలో దీనిని పెంచుట కొంతకష్టము. బెంగుళూరు, పెనుగొండ ప్రాంతములందు దీనికృషి జయప్రదముగ సాగుచున్నది. ఫలములు తిందురు. ఎండబెట్టి నిలవచేయవచ్చును. ద్రాక్ష సారాయిచేయుటకు ప్రశస్తమైనది.

## 18. పాల.

### Mimusops hexandra.

దక్షిణభారతదేశమునందలి కొండలమీద విరిగా ఎదుగు ఒక పెద్దవృక్షము. గోదావరిమన్యమున ఈ చెట్లు విస్తరించిగలవు. సింహళద్వీపమునందలి అడవులలో బాగుగనున్నవి. పాలచెట్టు బెరడుకు ఎట్టి ఉపయోగముకాని కనుగొనబడలేదు. పాలగింజల నుండి నూనివచ్చును. బరోడాలో ఆనూనెను నేతిలో కలగలపుచేసి విక్రయింతురు. నవంబరు డిశంబరు నెలలలో పుష్పించును. పండ్లు భుజింతురు. వండిన అన్నము తినరాని వ్రతదినములందు ఎండిన పాల పండ్లను హిందువులు తిందురని బరోడా గజిటీర్‌లో గలదు. బరోడాలో పేదవారు వేసవికాలమున పాల పండ్లను మజ్జిగలో కలుపుకొని తిందురు. గుజరాతు దేశమునకూడ వేసవిలో పేదవారికి పాలపళ్ళే ప్రధానమైన ఆహారము. ఇతరతావులయందు ప్రజలు దీనిని కఱవుకాలములందుమాత్రము ఆహారముగా వాడుదురు. కఱ్ఱ చాల గట్టిగ నుండును. దీనికలప తరణిపట్టుటకు చాలమంచిది. చెరుకుగానుగలకు, నూనిగానుగలకు, రోకలిదూలములుగను, ఇండ్లకు స్తంభములుగను వుపయోగించును. పాలపండు వీర్యవృద్ధికరమైనది, బలకరమైనది. పాలకఱ్ఱతో కవ్వము చేసి వాడుకొనుచుండినచో పశువులు బాగుగ పాలిచ్చునని ప్రజల నమ్మకము.

## 19. నారదబ్బ.

### Citrus Bigaradia.

ఇది పండకపూర్వము చాల చేదుగనుండును. పండినతరువాత నారింజపండు రుచికలిగి ఉండును. అయినను ప్రజలు దీనిని విస్తారము పెంచుటగాని, తినుటగాని లేదు. ఊరగాయకుమాత్రము వాడుచున్నారు. నారదబ్బ పూవులనుండి ఫ్రాన్సులో ఒక విధమగు అత్తరువు తయారుచేయుదురు. ఈఅత్తరువు ఉడుకులోను చేయుట కుపయోగించును.

## 20. నారింజ.

### Citrus Aurantium.

హిందూదేశము అన్నిప్రాంతములందును పెంచబడుచున్నది. సాధారణముగ డిశంబరు మొదలు మార్చివరకు ఫలించుచునే ఉండును. నీరునిలవని తేమనేలలు ప్రశస్తములు. నారింజపండుతొక్క జీర్ణశక్తినిచ్చునదిగను, రసాయనముగను వుండును. నారింజపువ్వులనుండి బట్టీపట్టినద్రవము హిస్టీరియా వ్యాధికి మంచిది. నారింజ రక్తశుద్ధికరముగ నుండును. జ్వరితుని దాహముకట్టును. జీర్ణకోశమును బాగుచేయును. నారింజపండుతొక్కను ముఖముపై రుద్దిన తారుణ్యపీటికలు మానును. నారింజచెట్లు బహువర్షములు బ్రతుకును. కొన్నికొన్ని అరువందల సంవత్సరములవరకు బ్రతికియుండి ఫలించును. ఒక్కొక్కచెట్టు 500 మొదలు 6,000 వరకు కాయలను ఏడాదికి కాయును. పన్నెండు అడుగుల చుట్టుకొలతగల కాండముతో ఏభై అడుగుల ఎత్తు వరకు ఎదిగిన నారింజచెట్లు గలవు.

## 21. నిమ్మ.

### Citrus Acida.

సర్వత్ర పెంచబడుచున్నది. నిమ్మపళ్ళు గుండ్రముగానుండును. తోళ్ళు పదునుచేయుటలో నిమ్మ ఆకులు వాడబడుచున్నవి. నిమ్మరసము విశేషముగా మందులందు వాడబడుచున్నది. తలకు నిమ్మరసము

మర్దించిన పిత్తమును శాంతింపచేయును. హిస్టీరియా వ్యాధియందలి గుండెదడకు నిమ్మరసము మంచిమందు. నిమ్మపళ్ళతో పచ్చడి పెడుదురు.

## 22. నేరేడు.

## Eugenia Jambos.

హిందూదేశమునందంతటను పెంచబడువృక్షము. పండ్లు వర్షకాలమున లభించును. పండ్లలో ఒకవిధమైన మంచివాసనగలదు. కాని రసము బొత్తిగా వుండదు. చెట్టు కనులపండువుగా నుండును. ఫలములకొరకేగాక అందముకొరకును ఇది పెంచబడుచున్నది. దీనికి సంస్కృతమున జంబువు అనిపేరు. దీనినిబట్టి హిందూదేశమునకు జంబూద్వీపమని పేరుగలదు. బర్మాదేశములో నేరేడుఆకులు వుడకబెట్టి నేత్రవ్యాధులకు వాడుదురు. నేరేడుగింజలనుండి మధుమేహామునకు మందు తయారుచేయబడుచున్నది. కలపవిలువైనది. నలభైఏండ్లకు పూర్తియగు ఔన్నత్యమందును. దీనికర్రతో వ్యవసాయపు పనిముట్లు చేయుదురు. నీటిలోవున్నను ఈకర్ర చీకదు. అగుటచే అజమీరు ప్రాంతములందు నూతికట్టులకు అడుగున వేయబడుచున్నది.

## 23. పంపరపనస.

## Citrus decumana.

మలయా అర్చిపెలగో, ఫీజీలో విస్తరించి పెరుగును. జావానుంచి హిందూదేశమునకు కొనిరాబడినది. వుష్ణదేశములందు జలసమృద్ధిగల తావులందు బాగుగ పెరుగును. బర్మా, హిందూదేశములందు సాధారణమైన ఫలవృక్షములలో నిదియొకటి. వంగదేశమున, ఆంధ్రదేశమున దీనికృషి విస్తారము. నారింజజాతి వృక్షములలో ఇది మిక్కిలి పెద్దకాయలు కాయును. ఒక్కొక్కటి 10 మొదలు 20 పౌనుల వరకు తూగును. కాయలు ముచికలుతేలి గుండ్రముగా నుండును. తొనలు తెల్లగాగాని ఎఱ్ఱగాగాని వుండును. పంపరపనసపండు పుష్టికరమైనది, చలువచేయునది. ఈపండులో మధురపదార్థము, పులుపుపదార్థము కలిసియున్నవి. ఆకులు అపస్మారము, కలరా, ఈడ్పులుగల దగ్గు వీనియందు వుపయోగము. ఒక్కొక్కపండు చుట్టుకొలత రెండుఅడుగులు వుండుట కూడగలదు.

## 24. పనస.

## Artocarpus integrifolia.

మలయాదేశంలో పనసకాయ బాగాముదిరిన తోడనే దానికి ఒకసంచి తొడుగుదురు. పండువాసనకు చీమలు దానిమీదమూగుతాయి, ఇతర పురుగులువచ్చి కాయకు హానిచేయడానికి ఇందువల్ల వీలులేకుండా పోతుంది. కాఫీపంటకు నీడనిచ్చేటందుకు ఈచెట్లను కొన్నిచోట్ల ఉపయోగించినారు. కాఫీచెట్లకంటె, మిరియాలచెట్ల ప్రవర్ధనమునకు దీనినీడ అనుకూలంగా వుంటుందని చెపుతారు. చెట్లువేసిన ఆరు లేక ఏడేళ్ళకు కాపుపట్టతాయి. అప్పటికి అవి 35 అడుగుల ఎత్తువరకు ఎదగవచ్చు. జంతువుల్లోకి ఏనుగువలె ఇది పళ్ళల్లోకి మిక్కిలి పెద్దది. 110 పౌనుల తూకముగలపండ్లుకూడ ఉండును. ఒక సామాన్యకుటుంబమునకు ఒకపండు ఒకపూటకు ఆహారముగా ఉపయోగింపదగియుండును. సాధారణముగ ఒక్కొక్కపండు సగటున 40 పౌనులు ఉండును. గింజలు వుడికించుకొని తినవచ్చును. బాగుగా ముగ్గినపండులోని తొనలు విరేచనకారి. ముగ్గనిచో అజీర్ణము, మలబద్ధము కలిగించును. పాలతల్లులు పనసతొనలు తినకూడదు. పాలతోబాటు ఇది ఒక హానికరమైన పదార్థమును స్రవింపచేసి పిల్లలకు హానిచేయును. బెల్లపుపాకములో తొనలనువేసి మలయాదేశస్థులు, చీనావారు నిలవచేతురు. కొన్నితావులయందు తొనలు ముక్కలుగాకోసి ఎండబెట్టి నిలవచేసి అవసరమైనపుడు వుప్పుకలిపి వుడకబెట్టుదురు. కలప విలువయైనది, పసుపుచాయగలది. బలిద్వీపములో రాజగృహములు ఈకలపతో కట్టుదురు. ఫిలిపైన్ దీవులలో సంగీతసాధనలు తయారుచేయుదురు. కుర్చీలు మొదలైన ఇతరపరికరములు చేయుదురు. మనదేశమున పనసకలపను విరివిగ వాడుదురు. యూరపులో బల్లలు మొదలైన ఇంటిపరికరాలకు, బ్రష్షులపిళ్ళకు దీనిని

ఉపయోగింతురు. ఇండో చీనాలోని బౌద్ధులు దేవమందిరనిర్మాణమునకై ఈకలపను ప్రత్యేకింతురు. పనసకఱ్ఱ ఉడకబెట్టుటచే కలిగినరంగుతో బర్మా సయాములోని బౌద్ధభిక్షుకులు తమ వస్త్రములకు రంగువేసుకొందురు. పనసకఱ్ఱలనుండి వచ్చినరంగు పట్టుబట్టలకు బాగా అద్దును. పనసవేరుకషాయము జ్వరమునకు మలాయాదేశస్థులు వాడుదురు. ఫిలిప్పైన్ దీవులలో ఆకులు వెచ్చచేసి గాయములమీద వేసి కట్టుదురు. పనసపాలుచేత గర్భపాతమును కలిగించును. పనసఆకులు దుప్పులు, కణుజులు ప్రీతితో తినును. మేకలు పనసఆకులను తినినచో బాగుగా బలియును. కొన్నిదేశములందు పనసఆకులను ఉడకబెట్టి పాలతల్లులకు పెట్టుదురు.

## 25. పుచ్చ.

Citrullus Vulgaris.

నదీతీరములందలి ఇసుకనేలలు ప్రశస్తములు. అకాలవర్షములు పుచ్చపాదులను కుళ్ళజేయును. పై చర్మము తెలుపు, గులాబి ఇత్యాదిగనుండు రకములు గలవు. గింజలు సాధారణముగ నల్లగనుండును. ఎఱ్ఱగనుండు రకమునుగలవు. గింజలలో చమురు కలదు. మనదేశమున కొందరు ఈగింజలను పొడిచేసి రొట్టెలు చేసుకొనియు, ఇతరవిధములుగను వుపయోగింతురు. గింజలలో ప్రొటీనులు విస్తరించియున్నవి. ఎట్టివిషమునులేదు. ఆఫ్రికాలో కొన్నిప్రాంతములందు ఈగింజలనూని వేరుశనగనూనెకంటె చవుకగా అమ్మబడును. నూని తీసివైచిన ఈగింజల తెలికపిండి పశువులకు ప్రశస్తమైన ఆహారము. మలయా, జావా దేశస్థులు పుచ్చపండుగుజ్జును తాటిబెల్లముతో కాని, తేనెలోకాని కలిపి తినుట విరుద్ధాహారమందురు. గర్భస్రావానంతరము కలిగే రక్తస్రావమును కట్టుటకు పుచ్చవేళ్ళరసము వుపయోగింపబడుచున్నది. గింజల పై బెరడు మనవైద్యులు ఔషధముగా వాడుదురు. పుచ్చపండు బలకరము, దాహశాంతికరము.

## 26. పూతిక.

Grewia asiatica.

హిందూదేశమునందంతటను పెంచబడు చిన్నవృక్షము. శీతకాలము అంతమగునపుడు పుష్పించును. ఏప్రియల్, మే మాసములకు ఫలించును. పట్టనుండి నారవచ్చును. ఆనారతో తాళ్ళుచేసెదురు. పూతికమలను వెంటపడెడు చీమును కట్టును. చలవచేయును. జీర్ణకోశమును బాగుచేయు గుణముకలది. పూతిక పండ్లనుండి ఒకవిధమైన సారాయముదింపుదురు. పూతికపళ్ళను పంచదారతోకలిపి షరబతు చేయుదురు. పొక్కులకు బొబ్బలకు పూతికఆకు నూరి పట్టింతురు. ఆమవాతమునకు దీనివేరు పట్టను మందుగా సాంతాల్ పరగణాలో వాడుదురు. కలప తేలికయైనదైనను గట్టిగానుండును. అగుట కొట్టుడుకఱ్ఱలకు, బాదుడుకఱ్ఱలకు బాగుగ ఉపయోగించును. చెక్కెరను తయారుచేయునపుడు చెక్కెరను తెలుపుచేయుటకుగాను సహరన్‌పూర్‌నందు దీనిపట్ట రసమును ఉపయోగింతురు.

## 27. బొప్పాయి.

Carica Papaya.

విత్తులవలన ప్రవర్ధనము. అంట్లును కట్టవచ్చును. మొదటి మూడుసంవత్సరములు మంచిఫలమిచ్చును. ఒక్కొక్కచెట్టు ఆరేండ్లు బ్రతుకును. పండ్లు రుచిగానుండును. ఎగుమతికి ఆగవు. కాయలు ఉడకబెట్టి కూరవండుకోవచ్చును. దోరపండ్లు ముక్కలుగా కోసి ఉడకబెట్టి మురబ్బాచేయవచ్చును. పండులో నూటికి 90 పాళ్లు నీళ్లు. జీర్ణశక్తినిచ్చుగుణము విశేషముగా కలదు. చర్మముమీది మచ్చలు పోగొట్టుటకు బొప్పాయి రసము పలుదేశములందు వాడబడుచున్నది. పులిపిరికాయలకు, చెమటకాయలకు పైన పట్టించినచో నయమగును. కాలినపుండ్లపై పట్టించినచో బాధశమించును. విత్తులు పేగులలోని క్రిములను హరించును. స్త్రీ ప్రసవించినతరువాత కడుపుమీద పట్టువేయువస్తువులలో మలయాదేశస్థులు బొప్పాయి గింజలనుకూడ వాడుదురు. జ్వరితులకు చెమటపట్టు

టకై జావాలో ఈగింజల చూర్ణము నుపయోగింతురు. బాగుగా పండని బొప్పాయి భక్షణము గర్భవతులకు ప్రమాదకరమైనది. గర్భపాతము కలిగించవచ్చును. లేతఆకులు కొన్నిదేశములలో కూరవండుకుందురు. కొన్నిదేశములలో పొగాకుకు బదులుగా బొప్పాయి ఆకులతో చుట్టలు చుట్టుకొని కాల్తురు. ఈచుట్టలు వుబ్బసమును తగ్గించునందురు. పువ్వులు మలయాలోను, జావాలోను ఆహారపదార్థముగా వాడుదురు.

### 28. మాదీఫలము.

### Citrus Medica.

నారింజజాతి వృక్షములలో చిరకాలముగా హిందూదేశమున పెంచబడుచున్నవానిలో ఇదియొకటి. దీని జన్మదేశము హిందూదేశమే అయివుండును. దీని పువ్వులను బట్టీపట్టి పన్నీటిని తయారుచేయవచ్చును. దీనికాయలవలుపునుండియు ఒకవిధమైన సువాసనద్రవమును గ్రహింపవచ్చును. పండుతోలు వేడిచేసి ఆర్పును, రసాయనము. గుజ్జు చలవచేసి ఆర్పును. గింజలు, ఆకులు, పువ్వులు వేడిచేసిఆర్పును. పండురసము వేడిమిని పోగొట్టి చలవచేయును. గ్రాహిగుణముకలది. మాదీఫలము విషములను వెడలద్రోయును. ప్రాణహరమైన విషమును లోనికి పుచ్చుకొనినవారికి దీనిరసము బాగుగనిచ్చినచో ఇది మలకోశమునకు చురుకుపుట్టించి విషమును వెలికి విడలింపచేయును. నోటిదుర్గంధమును తొలగించుటలో ప్రశస్తమైనది. బట్టలనడుమపెట్టినచో మాదీఫలము బట్టలకు పురుగులను పట్టనీయదు.

### 29. మామిడి.

### Mangifera Indica.

మనదేశమున విరివిగపెంచబడు ఫలవృక్షములలో దీనిని ముఖ్యముగ చెప్పవలయును. మామిడి ఫలరాజము. మామిడిలో పెక్కురకములుగలవు. ఎర్రచెక్కునేలలు దీనికెంతయు అనుకూలమైనవి. అంటుమామిళ్లు ఐదుఏళ్ళకును, దేశవాళిమామిళ్లు ఎనిమిదేండ్లకును కాయును. మామిడికలప విలువయైనది. మామిడిటెంకలోని జీడి ఊరకోళులకు మంచి ఆహారము. మామిడిపండు వీర్యవృద్ధికరము, బలకరము. హృదయమునకు మేలుచేయును. శరీరమునకు కాంతి కలిగించును. మామిడికాయతో వరుగుచేయుదురు. పండ్లపేశముతో తాండ్రవూయుదురు. ఊరగాయ వృక్షములలో మామిడి ప్రధానమైనది. మామిడివేరుపట్ట మలబద్ధకారి ; అతిసారమును కుదుర్చును. మామిడిచెట్టు శుభకరమైనదని హిందువుల నమ్మకము.

### 30. రాచయుసిరిక.

### Phyllanthus distichus.

చిన్నచెట్టు. ఆకులు ఒకటిరెండు అడుగుల పొడుగుగానుండును. తెలుపు పూయును. చెమటను పుట్టించును. పండు గుండ్రముగా నొక్కులు తీరియుండును. పండురసము కొంచెము పులుపుగానుండును. పచ్చిదిగానే తిందురు. లేదా పచ్చడిచేయుదురు. పప్పులో కలిపి కూరవండుదురు. ఊరగాయపెడుదురు. రాచయుసిరికగింజలు విరేచనముగావించును. దీనివేరు గాఢవిరేచనకారి. ఆకులకషాయము స్వేదజనకమైనది. దక్షిణ భారతదేశమున, బర్మాలోను, అండమాను దీవులయందును బాగుగ ఎదుగును.

### 31. రామాఫలము.

### Anona Reticulata.

చిన్నచెట్టు. విత్తులవలన ప్రవర్ధనము. అంట్లు కట్టి, పెంచవచ్చు. విత్తులు క్రిమిహరమైనవి. విత్తుల గాఢసారము గ్రహణికి, అతిసారవిరేచనములకు వాడబడుచున్నది. పట్టచూర్ణము ఇదే గుణము ఇచ్చును. మలయావారును, చీనావారును మిక్కిలి వగరుగల దీనిపట్టను రసాయనముగ నుపయోగింతురు. జ్వరములందు దీనివేరు లోనికి ఈయబడుచున్నది. అపస్మారము, మూర్ఛరోగములందును రామాఫలవృక్షము వుపయోగింపబడుచున్నది. వేరుపట్ట పంటిపోటుకలిగినపుడు చిగుళ్ళకు వేయబడుచున్నది. దీని ఆకులు సీతాఫలపు ఆకులవలెనే గాఢమైన వాసనగలవి. వ్రణములు ఎదిగి చితుకుటకు ఈ ఆకులు వాడబడుచున్నవి. ఆకులరసము తలలోనిపేళ్ళను చంపును. వెస్టుఇండీస్‌లో ఆకులు తోళ్లు పదును చేయుటకు, నల్లరంగుఅద్దుటకు వాడుదురు.

### 32. రేగు.

### Zizyphus Jujeiba.

ఉండ ఊడుగు, పండ రేగు అని మనలో ఉన్న సామెతనుబట్టి మంచములకు రేగుకర్ర ప్రశస్తమైనదగుట తెలియవగును. చీనాదేశములో కొన్నిపండ్లను తిని కొన్నిటిని ఎండబెట్టి నిలవచేసి విదేశములకు ఎగుమతిచేయుదురు. ఎండబెట్టినవి ఎన్నాళ్ళయినను నిలవవుండును. కొన్ని పాకముచేసి నిలవయుంతురు. రక్తశుద్ధికరమని, అగ్నిబలమును పెంపొందించునని ఆయుర్వేదవైద్యులందురు. పట్ట, గింజలు గ్రహణికి; వేరుకషాయము జ్వరమునకును వాడబడుచున్నవి. వేరుచూర్ణము, ఆకులునూరిన ముద్ద గాయములపై పట్టు కుపయోగింతురు. ఫిలిప్పైన్ దీవులలో అన్ని రకములైన మలకోశసంబంధమైన బాధలకు పట్ట ఆకులకషాయము వాడబడుచున్నది. కాంబోడియాలోకూడ అంతియే. జావాలో పట్ట జీర్ణశక్తిని పెంచే రసాయనముగా ఎంచబడును. చీనానుంచి, పెర్షియన్ గల్ఫునుంచివచ్చిన ఎండిన రేగుపళ్ళు జావాలో ఔషధశాలల్లో అమ్మబడును. జ్వరరోగులను ఈఆకులనుండి చేయబడిన లోషన్‌తో స్నానముచేయింతురు. మలాకాలో పట్టయొక్క కల్కము ఉడకబెట్టి కడుపునొప్పికి వాడుదురు. కలప గట్టిగాఉండును. చిన్న పనివస్తువులు చేసికొనవచ్చును. కాల్చిన మంచిబొగ్గు అగును. కట్టెలుగాకూడ బాగుగా నుపయోగించును. పట్ట తోళ్ళను పదునుచేయుటకు ఉపయోగించును. లక్కపురుగులకు రేగుఆకులు మంచి ఆహారము.

### 33. వాక.

### Carissa carandas.

ముళ్ళతుప్ప. పండ్లకొఱకు విరివిగ పెంచబడుచున్నది. హిందూదేశమునుండి జావాకు అచ్చటినుండి ఇతరప్రదేశములకు కొనిపోబడింది. ఎరుపుడాలు గలిగిన తెల్లనిపళ్లుకాయును. అవి మిక్కిలి పుల్లగావుండును. కాని మధురపదార్థ మిశ్రితమైఉండుటచే రుచికరముగావుండి పప్పుకూర మొదలగు కలగలుపుకూరలకు బాగుగ ఉపయోగించును. దోరగనున్న స్థితిలో పచ్చళ్ళకు ఉపయోగించును. పంచదారతో కలిపి వాకపళ్ళరసము మంచిపాకము చేయవచ్చును. కర్ర తెల్లగా, గట్టిగా, నునుపుగానుండును. కాని లావుగా ఉపయోగింపదగు స్థితిలో నుండదు. నెల్లూరుజిల్లాలోని ఉదయగిరిప్రాంతములందు దీని కర్రలతో దువ్వెన్నలు చేయుదురు.

### 34. వెలగ.

### Feronia Limonia.

మెరకనేలలో పెంచబడుచున్నది. ముఖ్యముగా పండ్లకొఱకు. ఇతరమైన పెక్కు ఉపయోగములు గలవు. విత్తులవలన, అంట్లవలన, వేరుమొక్కలవలన పెంచవచ్చును. మారేడుపండుగుజ్జుతోవలెనే వెలగపండుగుజ్జుతోను మనదేశమున ఒకవిధమగు షరబతు చేయుదురు. జీర్ణకోశముయొక్క మాంద్యమును తగ్గించుటలో ఈ షరబతు ప్రశస్తమైనది. పండు పులుపుగ, వగరుగనుండును. కావున పంచదార కలుపుకుని భక్షింతురు. చిన్నచిన్నగింజలు చాలగనుండును. పండువలెనే ఆకులకును ఔషధోపయోగముకలదు. అజీర్ణరోగులకు వాడబడుచున్నవి. కాంబోడియాలో పట్ట, ఈనెలుకూడ ఔషధోపయోగమునకు వాడబడుచున్నవి. వెలగ ఈనెలు ఇతరచెట్ల ఈనెలతో కలిపి ముద్దచేసి ప్రదరరోగమునకు ఈయబడుచున్నవి. దీనిపట్ట విషహరమైనది. కలప పచ్చగా గట్టిగా ఉండును. ఇళ్ళు కట్టుటకు, బండిచక్రపు నడిమిదిమ్మలకు, గానుగరోటిలోని రోకళ్ళకు, వ్యవసాయపు పనిముట్లకు మనదేశమున వాడుదురు. జావాలో కట్టెలుగా కూడ వాడుదురు. వెలగ జిగురు ఔషధోపయోగముగలది. తుమ్మజిగురుకు బదులుగా వాడబడును. వెలగసారము హరిదళముతో కలిపిన పసుపుపచ్చ సిరాఅగును. ఆసిరాతో సయామునేశస్థులు తాటియాకులమీద వ్రాసికొందురు. వెలగ పండు కంఠశుద్ధిగావించును.

### 35. సపోటా.

### Achras Sapota.

దీనిపళ్ళు, కలప, జిగురు మంచి ఉపయోగకమై

నవి. గోలకాయలరకము, సుంద్రకాయలరకము అని రెండురకములు. రవాణాకు అనుకూలమైనది. నెలరోజులు నిలవవుండును. జావానుండి హాలండుదేశానికి డచ్చివారు తీసుకొనిపోవుచున్నారు. విత్తులవలన కంటె అంట్లవలన ప్రవర్ధనముమంచిది. కాయ జిగురుగానుండును. మలబద్ధమును కలిగించును. పక్వదశలో పండులో జిగురు లోపించును. ఈ పండ్లలో పుల్లటిపదార్థము బొత్తిగా తక్కువ. జావాదేశములో ఘటోటాపువ్వుల్ని మరికొన్ని వస్తువులతో కలిపి నూరి నీళ్ళాడిన స్త్రీ శరీరమునకు పట్టింతురు. కలప చాల విలువఅయినది. గట్టితనము, బరువు, నునుపు, మన్నికవుంది. కాని మామూలుపనులకు పనికిరాదు. దీని అంపవుపొట్టు ముక్కురంధ్రములలో పడినచో వానిని ఉద్రేకింపచేసి చాలబాధపెట్టును. మోతాదు తప్పిన ఈగింజలు విషము.

### 36. సీతాఫలము.

### Anona Squamosa.

మెరకనేలలు, ఇసుకనేలలు ప్రశస్తమైనవి. ప్రాయికముగా విత్తులనుండి ప్రవర్ధనము. అంట్లు కట్టియు పెంచవచ్చును. పండుగుజ్జులో నూటికి పదిపాళ్లు చెక్కెరగలదు. వెస్టుఇండీస్‌లో పులియబెట్టినపండ్లనుండి ఒకవిధముగు సారాయిచేతురు. గింజలలో నూటికి 45 పాళ్లు నూనెగలదు. తలపేలను చంపే విషముకలదు. మెక్సికోలో ఈగింజల చూర్ణమును తలకుపట్టింతురు. కాని ఇందలి నలక కంటిలో పడిన కళ్లు ఎర్రబారి చాల బాధపెట్టును. కావున జాగ్రత్తగ తలకుపట్టింపవలెను. గింజలచూర్ణము మర్మస్థానమునకు పట్టించి గర్భపాతమును కలిగింపవచ్చును. ఈ వృక్షముయొక్క ఇతరభాగములందును విషముగలదు. వ్రణశోషణమునకు ఆకులముద్దకట్టుట ఇండియాలో, జావాలో కలదు. ఈగలుమూసే వ్రణములకు, పురుగులుపట్టిన వ్రణములకు ఆకులముద్ద ఇండియాలో నుపయోగింతురు. ఆకులకు బదులుగా లేతకాయల నుపయోగించవచ్చును. వేరు గాఢవిరేచనకారి. తోళ్ళు పదునుచేయుటకు దీనిపట్ట ఉపయోగించును. ఒకరకపు లక్కపురుగులు దీని ఆకులను అతి ఆప్యాయముతోగ తినును.

త్వరలో వెలువడనున్న 'మన ఫలవృక్షములు' అను శీర్షికగల గ్రంథమునుండి ఈవ్యాసము సంగ్రహింపబడినది. ఈ గ్రంథమున అరువదింటికి పైబడిన మన ఫలవృక్షములనుగూర్చి విపులముగా వివరింపబడియున్నది. ఒక్కొక్క ఫలవృక్షమునే తీసికొని దానిచరిత్ర, దాని జన్మస్థలము, అది ఇతరప్రదేశములకు ఎప్పుడు ఎట్లు వ్యాపించినది, అవి పెరుగుటకు అనుకూలములగు ప్రదేశములు, వానికృషిలో అవలంబించవలసిన మెలుకువలు, వానిని ప్రవర్ధనముచేయువలసిన పద్ధతులు, వానిలోని రకములు, వాని పారిశ్రామికోపయోగములు, వాని ఔషధోపయోగములు, వాని కలపవలని ప్రయోజనములు మున్నగునవి విపులముగ వివరింపబడినది. ఈ గ్రంథమును ఫలవృక్షసర్వస్వమనవచ్చును. ఫలభక్షణము ఇపుడు దేశమున దినదినాభివృద్ధినందుచున్నది. మఱియు అన్నిరీతుల వ్యవసాయములందును ఫలవృక్షములసాగు విశేషముగ లాభదాయకమైనది. కావున ఫలవృక్షములనుగూర్చి తెలియదగిన విషయములనన్నిటిని ఒక్కచోచేర్చియున్న ఈగ్రంథము అందరివద్దను ఉండదగినది. మీ ప్రతికొరకు వెంటనే వ్రాయుడు.




౧౭౮. ఆంధ్రకథాసరిత్సాగరము.

ఇదివరకు కథాసరిత్సాగరమును ఆంధ్రులకు వచనములో శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిలవారు ప్రసాదించియున్నారు. ఇపుడు శ్రీ ఓలేటి వెంకటరామశాస్త్రిగారు దానిని పద్యరచనమున ప్రసాదింప కోరకొనినారు. కథాసరిత్సాగరమున తృతీయమగు లావాణకలంబకమును ఒక సంపుటముగా వెలువరించినారు. గ్లేజు కాగితములు. కాలికో బైండు. క్రౌను సైజున 310 పుటలు. వెల 1-4-0. వలయువారు గ్రంథకర్త పేర పీఠాపురము వ్రాయునది. సుప్రసిద్ధులగు వెంకటరామకృష్ణులను కవులజంటలో నొకరగు వెంకటరామశాస్త్రిగారి కవిత్వమునుగూర్చి ప్రత్యేకముగ చెప్పవలసినపనిలేదు. ప్రస్తుతము మన విమర్శనకు పాలుబడిన సంపుటములోగల లావాణకలంబకమున ఆరుతరంగములు కలవు. మచ్చుకు రెండు పద్యములు :

గీ. అగ్నికిఁ బ్రదక్షిణము సేయు నప్పు డెఱ్ఱ
బడిన పద్మావతీముఖపంకజంబు
భర్తృహృదయంబు నెఱిఁగి కోపమునఁ గలఁతఁ
జెందెనో నాఁగ నెంతయుఁ జెన్ను మిగిలె.

గీ. విభుని చెక్కిళ్ళ ముద్దులు పెట్టుకొనుచు
మోదభరమునఁ గనుదోయి మోడ్పు పెందఁ
దనదు మేనెల్లఁ బరవశత్వంబు నొంద
నతనిపై వ్రాలి నిశ్చేష్టయగుచు నిల్చె.

౧౭౯. సుశ్రుతసంహిత.

మన ప్రాచీనవైద్యగ్రంథములలో సుశ్రుత సంహిత యొకటి. పెక్కు వైద్యగ్రంథములను తెనుగున ప్రచురించి ఆంధ్రులకు మహోపకారమును గావించిన పిడుగు వెంకటకృష్ణారావుపంతులుగారు చిరకాలమునకు పూర్వమే యీ సంహితయందలి శరీరస్థానమును తెనుగున ప్రచురించిరి. మిగిలిన స్థానము లెవ్వియు ఇంతవఱకు ప్రచురితములు కాకుండెను. ఆయుర్వేదవిశారదులును, భరద్వాజాయుర్వేదగ్రంథమాలాస్థాపనాచార్యులును అగు శ్రీయుత పురాణపండ రామమూర్తిగారు ఇపుడు సుశ్రుతసంహితలోని నిదానస్థానమును తెనుగువారి అందుబాటులోనికి గొనివచ్చిరి. ఇందుకు వారినెంతయు కొనియాడుచున్నాము. సుశ్రుతము నిదానస్థానములోని మిగిలిన భాగములనుకూడ శ్రీవారు త్వరలో వెలువఱచునట్లు ఆంధ్రు లీగ్రంథకర్తకు ప్రోత్సాహమిత్తురుగాక అని కోరుచున్నాము. సుశ్రుతసంహితము నిదానస్థానములోని యీ మొదటి భాగము 100 పుటలది. దీనివెల 0-12-0. ఇందు వాత, ఆర్శో, ప్రమేహ, భగందర, కుష్ఠవ్యాధుల నిదానముగలదు. మూలశ్లోకము, దానికి తాత్పర్యము కూర్చబడియున్నది. వలయువారు సంపాదకుడు, భారద్వాజాయుర్వేదగ్రంథమాల, కాకరపఱ్ఱు, తణుకుతాలూకా అని వ్రాయునది.

౧౮౦. లలితకథావళి.

సుప్రసిద్ధాంధ్రగ్రంథరచయితలగు శ్రీయుత రాయసము వెంకటశివుడుగారిచే వ్రాయబడిన పదునొకండుకథల సంపుటి. ఇవి ఇంతకుమున్ను భారతి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, సమదర్శిని పత్రికలలో ప్రచురణముగాంచినవే. రమణప్పరావు, దయమణిరాణి, పిచ్చుకపిల్ల, రామస్వామి, వకుళ, భరతశాస్త్రి, జానకీబాయి, మయూరశర్మ, మురళీధరరావు, నాగరత్నము, మీనాక్షి అనునవి ఇందలికథల శీర్షికలు. ఈకథలు చదువుటవలన వినోదము కలుగుటయేగాక అతివేగముగ మార్పునొందుచున్న ఆంధ్ర సాంఘిక పరిస్థితులు అవగతమగుచున్నవి. రమణప్పరావు దస్యులను గూర్చినది. దయమణిరాణి ఆపదలందు ధైర్యమువహించి యొంటరిగ విదే

